

ఆరవ ప్రపంచ యువజనోత్సవ భారతీయ ప్రతినిధులలో కొందరు, క్రెమ్లిన్లోని ఉస్పెన్స్కీ ప్రార్థనాలయ ముఖద్వారం వద్ద

## ఈ సంచికలో

సంపుటి 8
సంచిక 19

# సోవియట్ భూమి

అక్టోబర్ 13, 1957

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖచే ప్రచురింపబడుతోన్న సచిత్ర పక్ష పత్రిక




## ఒక గ్రామ చరిత్ర

పి. బెలియవ్‌స్కీ, ఎ. ఛెర్న్యషోవ్

డాన్ నదికి అవతలగా ఉన్న రోడ్డు ఒరోనెజ్ నుండి ఉత్తర దిశకు పోతుంది.

ఆ రోడ్డున పోతుంటే ఇరవైమూడవ కిలోమీటర్ దగ్గర ఒక సన్ననిబాట చీలిపోతుంది. వచ్చిపోయే బండ్ల వల్ల ఆదారి గట్టి పడిపోయి ఉన్నది. అలా ఆ దారివెంట కొద్ది దూరం వెళ్ళగానే నోవో-జివోతిన్నోయి అనే గ్రామం యొక్క సున్నంవేసిన ఇండ్లు, ప్రభుత్వ భవనాలు, మోలటోవ్ సమిష్టి వ్యవసాయక్షేత్రపు ధాన్యపు కొట్లు మనకంటబడతాయి. నోవో-జివోతిన్నోయి గ్రామం ప్రక్కనే దాదాపు దానికి అనుకొని వున్నట్లే ఉన్నది మొఖవోత్కా గ్రామం.

డాక్టర్ ఎ. ఐ. షిన్గరేవ్ అనే ఒక స్థానిక డాక్టరు—ఈయనే తర్వాత కెరెన్స్కీ తాత్కాలిక ప్రభుత్వంలో వ్యవసాయశాఖ మంత్రి అయాడు — యీ గ్రామాల ప్రజల ఆరోగ్యం, జీవన పరిస్థితులను గురించి 1901లో విపరంగా పరిశీలనలు జరిపేవరకు వాని విషాదకర పరిస్థితిని గురించి తెలుసుకోడానికి ప్రయత్నించినవారే లేకపోయారు. ఈ పరిశీలనలను ఆధారంచేసుకొనే డాక్టర్ షిన్గరేవ్ ఒక పుస్తకాన్ని వ్రాశారు. ఆరోజుల్లో అది పెద్ద కలవరాన్ని కలుగజేసింది. "మరణిస్తున్న గ్రామం" అన్న అర్ధ స్ఫూర్తిగల శీర్షికతో ఆ పుస్తకం ప్రకటింపబడింది.

షిన్గరేవ్ ఆపుస్తకంలోఇలా వ్రాశారు :

"పుట్టుకలకంటే చావుల సంఖ్య ఎక్కువగా ఉంది. బ్రతికున్న ప్రతి వెయ్యిమందికి ముగ్గిరి చొప్పున మాత్రమే జనాభా పెరుగుతున్న గ్రామం నాశనమైపోక మానదు."

నొవో-జివోతిన్నోయి, మొఖోవత్కా గ్రామాలను



సమిష్టిక్షేత్ర నిర్వాహక సంఘ సమావేశపు దృశ్యం

అక్టోబరుసోషలిస్టు మహావిప్లవం అలాంటి వినాశనం నుంచి తప్పించింది.

## వినాశకరస్థితినుండి పునరుజ్జీవనానికి

విప్లవకాలంవరకు భయంకరమైన దారిద్ర్యము యీ గ్రామాల ప్రజలను పట్టుకు పీడిస్తుండేది. పెనివిరినోవ్‌లకు (స్థానిక భూస్వాములకు) నోవో-జివాతినోన్నోయి, మొఖోవత్కా గ్రామాలలోని మొత్తం 170 రైతు కుటుంబాలకు కలిపి వున్న భూమికంటే ముప్పై రెట్లు ఎక్కువ భూమి ఉండేది.

ఒక్కొక్క రైతు కుటుంబానికి సగటున 0.8 హెక్టర్లభూమి (సుమారు రెండెకరాలు) ఉంటుండేది. రైతు కుటుంబాలలో నూటికి 25 వాటికి భూమిగాని, గుర్రాలుగాని ఉండేవికావు. నోవో-జివాతినోన్నోయి, మొఖోవత్కాల జనాభాలలో అత్యధికభాగం కరువుకు తాళలేక జీవనోపాధికొరకు ఎక్కడికైనా తరలి వెళ్ళిపోతుండేవారు. భూస్వాములు, కులక్‌ల వద్ద రోజుకు 15-25 కోపెక్‌లకు వ్యవసాయ కూలీలుగా పనిచేస్తుండేవారు.

ఇల్లా జీవిస్తున్నవారికి అక్టోబరు మహావిప్లవం విముక్తిని తెచ్చిపెట్టింది. భూస్వాముల భూమి రైతులకు ఉచితంగా పంచిపెట్టబడింది.

సోవియట్ ప్రభుత్వం పేద, మధ్య తరగతి రైతులకు అప్పులు యివ్వడంద్వారా వాళ్ళను కులక్‌ల పట్టునుంచి విముక్తిని కల్పించింది. గ్రామాల్లో స్థాపింపబడిన వినియోగదార్ల సహకార సంఘాలను స్థాపించడం ద్వారా వాళ్ళకు గొప్ప సహాయాన్ని కలుగజేసింది. రహస్యంగా పేదరైతులను పీడించడం కొనసాగిస్తూనే కులక్‌లు గ్రామ సోవియట్‌లలోకి, పరపతి సంఘాలలోకి, సహకార సంఘాలలోకి చొరుచుకొనిపోవటానికి ప్రయత్నించారు. ముఖ్యముగా నోవో-జివాతినోన్నోయిలో 'క్రాస్నీ ఓక్త్యాబర్' సమిష్టి వ్యవసాయ క్షేత్రమూ, మొఖవోత్కాలో 'జా వ్లాస్త్ సోవియతవ్' సమిష్టి వ్యవసాయ క్షేత్రము స్థాపింపబడిన సమయంలో వీరి దుశ్చర్యలు మరీ మితిమీరి పోయాయి. ఈ కులక్‌లు సోవియట్ అధికారులపైన ప్రముఖ సమిష్టి వ్యవసాయ రైతులపైన దాడులను జరిపారు. ప్రభుత్వ ఆస్తిని ధ్వంసం చేశారు. కవ్వింపుచర్యలకు, లంచాలు మప్పటానికీ పూనుకొన్నారు. కాని చిట్టచివరికి సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు విజయం పొందింది, కులక్‌లు ఒక వర్గంగా రద్దుగావింపబడ్డారు.

ఈనాడు యీ గ్రామాలను పోల్చుకోవడమే కష్టమయిపోతుంది. ఆ గ్రామాలయొక్క ఆకర్షవంతమయిన కొత్తరూపాన్నిబట్టేకాక, వాటి ప్రజల సౌభాగ్యాన్నిబట్టి కూడా అలా జరుగుతుంది, ఈ రెండు గ్రామాల సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు యేడు సంవత్సరాల



మొఖవొత్కాలో కొత్త వీధి

క్రితం ఏకమయి మొలటోవ్ సమిష్టి వ్యవసాయక్షేత్రంగా రూపొందాయి.

## మహత్తర ఫలాలు

నోవో-నివాతిన్నోయి, మొఖవొత్తా గ్రామాల నివాసుల్లో షిన్గరేవ్ పేర్కొనిన దౌర్భాగ్య జీవితాన్ని చూచినవారు, లేదా స్వయంగా అనుభవించినవారు అనేకులున్నారు.

అవెర్యన్ పెత్రిన్ అలాంటివారిలో ఒకరు. 76 సంవత్సరాల వయస్సువచ్చినా ఇంకా ఆయన ఆరోగ్యంగా, చురుకుగా ఉన్నారు. షిన్గరేవ్ గ్రామపరిస్థితులను గురించి దర్యాప్తులు జరుపుతూ వాళ్ళయింటికివచ్చేటప్పటికి పెత్రిన్‌కి 25సంవత్సరాలవయస్సు. తమ ఆదాయం యెంత, తేనీటిలో పంచదార వేసుకొంటున్నారా, క్యాబేజీ సూపులో క్యాబేజీకాకుండా ఇంకా యేమైనా వేసుకొంటున్నారా—ఇలా యెన్నెన్నో ప్రశ్నలు పెత్రిన్‌ని అడిగి తెలుసుకున్నాడు షిన్గరేవ్. క్యాబేజీసూపా? "ఈ గడచిన ఒకటిన్నర సంవత్సరంలోగా క్యాబేజీసూపు ముఖమే చూడలేద"ని జవాబుచెప్పినట్టు షిన్గరేవ్ పేర్కొన్న ఆ అనారోగ్యపు అర్థాకలిరైతు పెత్రిన్‌తండ్రే.

పెత్రిన్‌తో మాట్లాడుతూ మేము తిరిగి అవే ప్రశ్నలు—క్యాబేజిసూపును గురించీ, తేనీటిలో పంచదార వేసుకొంటున్నారా లేదాఅనీ—అడిగాము. ఆ ముసలివాడు చిరునవ్వు నవ్వాడు. క్యాబేజిసూపులో అప్పుడప్పుడు మాంసం వేసుకొంటున్నమాట నిజమేననీ, పంచదార లేందే యెప్పుడూ తేనీటిని త్రాగడం లేదనీ, ప్రతిరోజూ పాలు త్రాగుతున్నామనీ తెలియజేశాడు. స్వంత ఆవు ఉన్నది. అంతేకాక సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో క్షీరాంగనగా పని చేస్తున్న అతని కూతురికి వేతనంలో కొంత భాగంగా చాలా పాలు లభిస్తుంటాయి.

కాని అసలు వచ్చిన మార్పులలోని ప్రధానాంశం యిది కాదు. పెత్రిన్ ఇండ్లో అన్నీ మారిపోయాయి. ఇల్లు పూర్తిగా పునర్నిర్మాణం గావింపబడింది. ఇప్పుడు కిటికీలు విశాలంగా వున్నాయి. కప్పు బాగా యెత్తుగా వున్నది. మాటిమాటికీ ఆరిపోతూ వుండిన పాత కిరోసిన్ దీపం స్థానంలో ఎలక్ట్రిక్ దీపం కనబడుతున్నది. తెల్లని గుడ్డ పరిచివున్న టేబుల్‌పైన రేడియో వున్నది. ఆ పైన కుటుంబపు మూడుతరాల వారి ఛాయాచిత్రాలు చక్కని ఫ్రేములో బిగించబడి గోడలకు తగిలింపబడి వున్నాయి. సమిష్టి వ్యవసాయ క్షేత్రాల రైతుల జీవితంలో వచ్చిన మార్పులన్నీ యిక్కడ ప్రత్యక్షంగా కనబడుతాయి.

"నా యౌవనంలో నేను, కుటుంబ పోషణకొరకు ఎన్నెన్నో పనులు చేశాను. మాకున్న భూమి చాలాకొద్ది, పైగా దానిని దున్నడానికి మా దగ్గర యేమీ వుండేది కాదు. కొండలు పగులగొట్టే పని కొంత కాలం చేశాను. ఒకసారి రాళ్ళు మీదపడి ప్రాణం పోయేంత పనైంది. దోనెట్జ్ ప్రాంతంలోని బొగ్గు గనిలో పని చేశాను. పెద్ద



ఫూకామందుల దగ్గర వ్యవసాయ కూలీగాకూడా పనిచేశాను, జీవితం కష్టతరంగా వుండేది," అని చెప్పాడా వృద్ధుడు.

సోవియట్ ప్రభుత్వం స్థాపింపబడిన తర్వాత మాత్రమే జీవితం చల్లనిచూపు చూచిందతనిపై.

ఈ వృద్ధుని సంతానమే పెత్రిన్ కుటుంబపు రెండవ తరం. విప్లవానంతరం నూతన సంబంధాల ప్రపంచంలోకి అడుగిడేటప్పటికి వాళ్ళింకా చిన్నవాళ్ళు. పెత్రిన్ పెద్దకొడుకు వాసిలి దేశభక్తి ప్రపూరిత మహా యుద్ధంలో దేశంకొరకు ప్రాణాల నర్పించాడు. రెండవ కొడుకు ఇవాన్ మెషిన్ ఆపరేటర్‌గా పని చేస్తున్నాడు. మోలటోవ్ సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి చెందిన మెషిన్, ట్రాక్టర్ కేంద్రంలో పని చేస్తున్నా డతడు.

మూడవతరం వారయిన అతని మనుమలు అతని పోషణలోనే వున్నారు. వారు సాంస్కృతికంగా సమాజంలో యెంతో ఉన్నత స్థానాన్నందుకున్నారు. పూర్వకాలంలో నైతే అలా జరుగుతుందని కలలోనైనా వాళ్ళు ఊహించుకొనలేక పోయేవారు. వాసిలీ కొడుకు నికోలాయ్ రైల్వే ఇంజనీరయ్యాడు. కూతురు మరియా ఈ మధ్యనే వైద్యవిద్యా సంస్థలో ఆరవ సంవత్సరం చదువు పూర్తి చేసింది. త్వరలో డిప్లమో లభించ బోతున్నది. వాసిలీ చిన్న కూతురు అన్నా, నొవా-జివొతిన్నొయిలో సెకండరీ పాఠశాల ఉపాధ్యాయినిగా పని చేస్తున్నది.

ఈ సందర్భంలో పెత్రిన్ కుటుంబానికి ప్రత్యేకించి అనుకూలపడిన విషయం యేదో ఉన్నదనుకోగూడదు. మేము సందర్శించిన యితర కుటుంబాలలో గూడా పరిస్థితులు యిదే విధంగా ఆశాజనకంగా ఉన్నాయి.

## జీవనప్రవాహం

నొవా-జివొతిన్నొయి గ్రామంలోకి ప్రవేశించేముందు మనం కొన్ని కొత్త ఇండ్లను దాటిపోవలసి ఉంటుంది. ఈ మధ్య వరకు ఖాళీభూమిగా వున్న యీ ప్రాంతంల్లో ఇప్పుడీ కొత్త ఇండ్లు ప్రత్యక్ష



పొలంనుండి ధాన్యాన్ని లారీ కెక్కించడం



మయ్యాయి. ఇదే సోల్నిత్సి-దుబ్రోవ్స్కయా మెషిన్, ట్రాక్టర్ కేంద్రం యిదే. దానికి సంబంధించిన ఉద్యోగుల ఇండ్లూ, రిపెయిర్ షాపులు, విశాలమైన హాస్టళ్ళు అక్కడే ఉన్నాయి. కొత్తగా కట్టిన యీ వీధి పేరు యంత్రాలవారివీధి.

షెన్గరేవ్ దర్యాప్తులు జరిపిన కాలంలో యీ గ్రామంలో ఒకే ఒక ప్రాథమిక పాఠశాల ఉండేది. ఇప్పుడు, ప్రక్క గ్రామాల నుండి వచ్చే విద్యార్థులు వంద మందికి బోర్డింగ్ వసతులుగల దశవర్ష పాఠశాల ఉన్నది. పాఠశాలకు సమీపంలోనే ప్రసూతి వార్డు గల జిల్లా హాస్పటలు, రెండు క్లబ్బులు (ఒకటి గ్రామస్తులచేత, రెండవది మెషిన్, ట్రాక్టర్ కేంద్రం పనివారిచేత నడుపబడుతున్నాయి). మూడు గ్రంథాలయాలు, పోస్టు, టెలిగ్రాఫ్ ఆఫీసు ఒకటి, ఒక దర్జీషాపు, చెప్పులు బాగుచేసేషాపు ఒకటి వున్నాయి.

గ్రామంలోని ప్రతి ఇంటికి ఎలక్ట్రిసిటీ వున్నది. రేడియోకిగూడా యేర్పాట్లు చేయబడి వున్నాయి. డి. ఐ. కజరిన్ అనే ఒక పెన్షన్ దారునికి టెలివిషన్ కూడా ఉన్నది. సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి చెందిన కొన్ని చక్కని భవనాలు కూడా ఉన్నాయి. పశువుల శాల, రోలింగ్ మిల్లు, రంపపు కోతమిల్లు, యంత్రాలతో నూర్పిడిచేసే స్థావరం అలాంటివాటిలోవే. ఆర్టిజన్ బావి ఒకటున్నది. పంపులు పెట్టడానికి పథకం వేయబడింది.

గ్రామవీధుల్లోంచి నడుస్తూ ఉంటే, ప్రతి రెండవ లేదా మూడవ పాకముందు చక్కగా పేర్చబడిన ఇటుకలు, కలప అగుపడుతుంటాయి. కొత్తగా యిండ్లు కట్టుకోడానికి, లేదా పాతవాటిని పునర్నిర్మించుకోడానికి గ్రామస్తులు సంసిద్ధులవుతున్నారు. స్థానిక సోవియట్, సమిష్టి వ్యవసాయ క్షేత్రాల సహాయంతో గత సంవత్సరం సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి చెందిన 19 కుటుంబాలు స్వంత ఇండ్లను కట్టుకొన్నాయి.



సమిష్టి క్షేత్రపు ఆసుపత్రిలో



సేవింగ్సు బ్యాంకు

భోజన శాలలో



ఇప్పుడు ఇండ్లల్లో మనకెక్కడా కొయ్య బల్లల పడకలు అగు పడవు. దిండ్లు, కంబళ్ళు, దుప్పట్లు వున్న పడకలే కనబడుతాయి. దాదాపు ప్రతి కుటుంబము ప్రియస్, లేదా కిరొసిన్ స్టవ్‌ను వాడుతున్నది.

ఒక అర్ధ శతాబ్దం క్రితం షెన్గరేవ్ నొవొ-జివొతిన్నొయి గ్రామంలో సరుకులు కొద్దిగా మాత్రం ఉన్న రెండు దుకాణాలను మాత్రం చూచాడు. వాటిలోనైనా వ్యాపారం తక్కువగా జరుగుతుండేది. ఇప్పుడు గ్రామ సహకార సంఘ దుకాణం పెద్ద భవనంలో ఉన్నది. బేకరీ ఒకటి, తినుబండారాలు అమ్మే దుకాణం ఒకటి కూడా ఉన్నాయి.

ఈ మూడు దుకాణాలలో 1956వ సంవత్సరంలో జరిగిన మొత్తం 2,057,000 రూబుళ్ళ వ్యాపారాన్ని గమనించినట్లయితే ఆ గ్రామం యొక్క వ్యాపారం యెంత వృద్ధిలోకి వచ్చిందో అర్ధమవుతుంది.

నొవొ-జివొతిన్నొయి గ్రామ వినియోగదార్ల సహకారసంఘం అధ్యక్షుడు ఎఫ్. కె. గ్రెబిన్నికోవ్ మాకు కొన్ని ఆసక్తిదాయకమైన వివరాలను తెలియజేశారు. గతసంవత్సరం నూలు గుడ్డల అమ్మకం 1955కంటే 56,000 రూబుళ్ళు పడిపోయింది. ఇంకా ఇలానే తగ్గుతూ వున్నది. కాని ఉన్నిగుడ్డల అమ్మకం 20,000 రూబుళ్లు, సిల్కుగుడ్డల అమ్మకం 82,000 రూబుళ్ళు పెరిగింది. కుట్టినగుడ్డల అమ్మకం యీ యేడాది 366,000 రూబుళ్ళు, అనగా అంచనా వేసిన దానికంటే దాదాపు ఐదురెట్లన్నమాట. బూట్ల అమ్మకం అనుకున్న అంచనా కంటే రెండు రెట్లు పెరిగింది.

ఈ గ్రామవాసులు సైకిళ్ళను, మోటారు సైకిళ్ళను, కుట్టుమిషన్లను బాగా కొనుక్కొంటున్నారు. మేము సహకార సంఘం దుకాణంలో ఉండగా ఎ. ఎ. క్రెతినిన్ అనే ఒక మెషిన్, ట్రాక్టర్ కేంద్రం మెకానిక్ ఒక మోటారు సైకిల్‌ను కొనుక్కొన్నాడు.



ఎలీనా ఫోమినా, అవుదూడలను పెంచేఆమె

జోయా సాల్మనోవా, కట్టర్



ఎవెర్యామ్ పెత్రిణా, తోటమాలి



మరియా పెత్రినా
పండ్లను పెంచే ఆమె

నికొలాయ్ మిహైలోవ్,
మోటారు డ్రైవరు

షెన్గర్ల్వ్ ఆ గ్రామస్థులు యెలాంటి ఆహారాన్ని, ఎంతెంత తింటున్నారో తెలుసుకోడానికి ప్రయత్నించాడు. 1956 నాటి అవే విషయాలను తెలుసుకొని మేము ఆ నాటి వాటితో పోల్చి చూచాము.

## ప్రతిరోజు మనిషికొక్కింటికి వినియోగింపబడుతున్న ఆహార వస్తు వివరాలు(గ్రాములలో)

నదెజ్దా దెనిసోవా.
సమిష్టిక్షేత్ర రైతాంగన

| వస్తువు | 1910 | 1956 |
|---|---|---|
| రైరొట్టె | 709.50 | 198.90 |
| గోధుమపిండి | 11.10 | 300.30 |
| ధాన్యం, లెగూములు | 125.10 | 44.00 |
| జంతికలు | — | 40.00 |
| బంగాళదుంపలు | 233.85 | 576.00 |
| క్యాబేజి | 94.06 | 98.80 |
| దోసకాయలు | 2.74 | 80.00 |
| టమాటాలు | — | 102.00 |
| నూనె | 2.49 | 12.00 |
| వెన్న | 0.70 | 13.00 |
| పంచదార | 0.78 | 31.00 |
| మిఠాయి | — | 50.00 |
| మాంసం, తదితరం | 36.62 | 62.00 |
| కొవ్వు | 0.34 | 16.40 |
| చేపలు | 6.37 | 10.50 |
| హెర్రింగ్ చేపలు | 0.28 | 23.60 |
| పాలు | 220.37 | 561.40 |
| గుడ్లు | 3.13 | 10.20 |
| | 1,447.43 | 2.230.60 |

నికొలాయ్
దెవిత్‌స్కీ,
ఫిట్టర్

సమిష్టి క్షేత్రంలో
రొట్టెలు కాల్చే
మనిషి

ఇప్పుడీ గ్రామస్థుల ప్రధాన ఆహారం రొట్టె, అంబలి కావు. ప్రతికుటుంబంవారు వెన్న, నూనె, మాంసం, కొవ్వు, చేపలు, గుడ్లు, కూరగాయలు తింటున్నారు. పాల ఉపయోగం రెండింతలు పెరిగింది. ఇక బంగాళా దుంపల విషయం చెప్పనవసరం లేకుండానే



ఇవాన్ అర్జనోవ్, కంబైన్ ఆపరేటర్



సమిష్టి క్షేత్రదారులు, నికొలాయ్ పెత్రిన్, నికొలాయ్ మిహైలోవ్

పైతర్ కొరకొలా, కంబైన్ ఆపరేటర్




తెలుస్తుంది. పంచదార, మిఠాయి విషయమైతే అసలు పోలికే లేదు.

పూర్వం దారిద్ర్యం, పోషక ఆహారం లేకపోవడం అనారోగ్య పరిస్థితులు రోగాలను తెచ్చిపెట్టి మరణ సంఖ్యలను అధికం చేస్తుండేవి.

ఈనాడు యీ రెండు గ్రామాల ప్రజలు వైద్య సహాయంకోసం దూరం పోనవసరం లేదు. జిల్లా హాస్పటలు, దాని ప్రసూతి శాఖ నొవొ-జివొతిన్నొయి గ్రామంలోనే వున్నాయి.

ఆ హాస్పటల్ అధికారి అయిన యువకుడు డాక్టర్ ఎ. ఎమ్. ప్లోత్నికోవ్ ఇలా అన్నాడు మాతో :

"అంటువ్యాధులు యీ గ్రామాల్లో వ్యాపించడం చాలాకాలం క్రితమే ఆగిపోయింది. అందువల్ల గ్రామవాసులు యీనాడు వాటిని గురించి మరిచిపోనే మరిచిపోయారు. కంఠసప్పి, మొదలైనవి మచ్చుకి లేకుండా పోయాయి.

"దీని ఫలిత మేమిటో చూడండి : గత మూడు సంవత్సరాలలో ఈ గ్రామాలలో పుట్టుకల సంఖ్య 132, మరణాల సంఖ్య 19."

## భూమి చెప్పినట్టు వింటోంది

మోలటోవ్ సమిష్టి వ్యవసాయ క్షేత్రం నిర్వాహక సంఘం మొన్నటి రోజున నొవొ-జివొతిన్నొయి క్లబ్బులో సమావేశమైంది.

సంఘ సభ్యులు, లెక్కల తణికీ సంఘం సభ్యులుగాక సమిష్టి వ్యవసాయ క్షేత్రపు చురుకైన కార్యకర్తలు వందమంది యీ సమావేశంలో పాల్గొన్నారు.

ఈ సమావేశానికి ముందురోజు సాయంత్రం అదే హాలులో ఒక అసాధారణమైన సమావేశం జరిగింది. బాగా పెంపొందుతున్న పశు ప్రజననం దృష్ట్యా ఈ సంవత్సరము, వచ్చే సంవత్సరము, ఆపై సంవత్సరము సమిష్టి వ్యవసాయ క్షేత్రం పాలను, మాంసాన్ని ఎంత ఎక్కువ ఉత్పత్తి చేయగలదన్న విషయాన్ని అంచనా వెయ్యసాగారు అక్కడ చేరినవారు.

మోలటోవ్ సమిష్టి వ్యవసాయ క్షేత్రం



అధ్యక్షుడైన వ్యవసాయ శాస్త్రవేత్త గ్రిగొరి గొలొవిన్ ఆ అంచనాలనుగురించే సంఘానికి నివేదించాడు.

1956 లో యీ వ్యవసాయ క్షేత్రం తగు అభివృద్ధిని సాధించి మామూలు స్థితికంటే ఒక అడుగు ముందుకు వెళ్ళిందని చెప్పవచ్చు. సగటున ఒక ఆవునుండి లభించే పాల మొత్తం 1955 కంటే 1,029 కిలోగ్రాములు యెక్కువయింది. ప్రతి వంద హెక్టర్ల భూమి! మాంసం ఉత్పత్తి మూడున్నర టన్నులు అధికమైంది.

అధ్యక్షుని నివేదికలో ముందు సాధ్యం కానున్న వాటి గురించి వెల్లడించిన విషయాలు ఇదివరకు సాధించిన విషయాలన్నింటిని మైమరపిస్తున్నాయి. ఈ సంవత్సరం ప్రతివంద హెక్టర్ల భూమిపైన 4.4 టన్నుల మాంసం, 17.5 టన్నుల పాలు ఉత్పత్తి

ఎల్లలుదాటి

ఎడమవైపైన:
సమిష్టిక్షేత్ర వాద్యబృందం



కాన్యా గ్రెబెన్ షకోవా పియానో వాయిస్తూ

సమిష్టి క్షేత్రపు రేడియో ప్రసారవిభాగం



కాగలవని అంచనా వేయబడుతున్నది. వచ్చే సంవత్సరం (అదే పరిమితి భూమిలో, 12.3 టన్నుల మాంసం, 30 టన్నుల పాలు ఉత్పత్తి అవుతాయట. 1959 లో యీ ఉత్పత్తి ఇంకా అధిక మవుతుంది.

ఈ సంవత్సరమే సమిష్టిక్షేత్ర ఆదాయం రెండు మిలియన్ల రూబుళ్ళు పెరిగింది. 1958 కల్లా అది మూడింతలధికమవుతుంది. ఈ విధంగా అనుకున్నదానికంటే ఎక్కువగా ఉత్పత్తి జరుగుతుండడం మూలాన, ఒక్కొక్క పనిరోజుకు ఇదివరకు అంచనా వేసినట్టు ఐదు రూబుళ్ళు, రెండు కిలోగ్రాముల ధాన్యం కాక, ఎనిమిది రూబుళ్ళు, రెండు కిలోగ్రాములకు మించి ధాన్యము చెల్లించడం సాధ్యమవుతుంది. వచ్చే సంవత్సరం, అనగా 1958 లో, ప్రతి పనిరోజుకు పది రూబుళ్ళు చెల్లించడం సాధ్యం కావచ్చునని అంచనా వేయబడుతున్నది.

"ఈ కార్యాన్ని మనం సాధించగలమా", అని గొలొవిన్ అడిగాడు, అక్కడ సమావేశమైన వాళ్ళ వైపు చూస్తూ.

"అవును, సాధించగలం," అని యేకగ్రీవంగా సమాధానం వచ్చింది. తర్వాత ఉపన్యసించిన వారందరు అది యేవిధంగా, ఎలాంటి పద్ధతులద్వారా సాధ్యమవుతుందో వివరించారు.

నొవొ-జివొతిన్నోయి గ్రామవాసులు తమకున్న 3,000 హెక్టర్ల భూమిని, ఆధునిక యంత్రాగారాలను చూచుకొనే తమ్మ గమ్యాన్ని చేరుకొనగలమని అంత ధైర్యంగా మాట్లాడుతున్నారు.

* * *

నొవొ-జివొతిన్నోయి, మొఖవత్కా గ్రామాల సమిష్టి వ్యవసాయ క్షేత్ర రైతుల జీవితాలకు సంబంధించిన కొన్ని అంశాలను గురించి వివరించే టప్పుడు మేము షెస్తరేవ్ తన "మరణిస్తున్న గ్రామం" అన్న పుస్తకంలో అవలంభించిన పద్ధతిని పూర్తిగా అనుసరించలేక పోయాము. ఎందువల్లనంటే 50 సంవత్సరాల క్రితపు విషయాలతో పోల్చడమే సాధ్యం కానటువంటి అనేక కొత్త అంశాలు రైతుల జీవితంలో వెల్లడవుతున్నాయి. ఇది పూర్తిగా విభిన్నమైన జీవితం. ప్రజలు పూర్తిగా మారిపోయారు.

ఈ మార్పులను కేవలం వాటి ప్రమాణాన్ని బట్టి మాత్రమే అంచనా వెయ్యడానికి వీలులేదు : ఒక వస్తువు అధికంగా వుంచే, మరొక వస్తువు తక్కువగా వుంటున్నది; కొన్నయితే పూర్తిగా మటుమాయ మయ్యాయి. బ్రహ్మాండంగా గుణాత్మకమైన మార్పులు



పశువుల దొడ్డి

పాల పనిమనిషి మరియా మిఖైలోవా



★

సంభవించాయి. అంకెలలో వాటిని అంచనా కట్టడం అసాధ్యం. ఉదాహరణకు, నేను కేవలం ప్రజల అక్షరాస్యతను గురించి చెబితే చాలదు. అక్షరాస్యతకంటే ఉన్నతమైన విషయాన్ని గురించి, వేరే మాటల్లో చెప్పాలంటే సంస్కృతిని గురించి ఈనాడు చెప్పవలసి వుంటుంది. ఒక ఉదాహరణ నిస్తాను. నొవొ-జివొతిన్నోయి గ్రామస్తుల బిడ్డల్లో సంగీత పాఠశాలల్లో పాఠాలు చెబుతున్నవారు ఇద్దరు (ఏమ్. ఫెదరోవా, ఇ. సఫనోవా), కొందరు డాక్టర్లు, ఉపాధ్యాయులు (ముగ్గురు గ్రామ పాఠశాలలోనే పని చేస్తున్నారు), ఇంజినీర్లు, వ్యవసాయ శాస్త్రవేత్తలు, సోవియట్ సైనికాధికారులు, కళాశాల విద్యార్థులు, ప్రత్యేక సెకండరీ పాఠశాలల విద్యార్థులు వున్నారు.

షెన్గరేవ్ *1901* లో యీ రెండు గ్రామాల్లో విపరీతమైన అజ్ఞానాన్ని, సంస్కారం లేకపోవడాన్ని గమనించాడు. నొవొ-జివొతిన్నోయి గ్రామంలోని పురుషుల్లో నూటికి 32.7 మందే అక్షరాస్యులనీ, వారిలో కూడా చాలామంది అర్థ-అక్షరాస్యులేననీ, స్త్రీలలోనైతే అక్షరాస్యులు నూటికిద్దరేననీ షెన్గరేవ్ వ్రాశాడు. ముఖవొత్కా విషయం ఇంకా అన్యాయంగా వుండేది. పురుషుల్లో అక్షరాస్యులు, అర్ధ-అక్షరాస్యులు అనదగినవారు నూటికి 16 మందే; స్త్రీలలో నైతే అక్షరాస్యులు అసలే వుండేవారు కాదు.

ఈనాడు గ్రామ గ్రంథాలయంలోనే 5,000 సంపుటాలు ఉన్నాయి. 850 మంది సమిష్టిక్షేత్ర రైతులు యెప్పుడూ వచ్చి పుస్తకాలు చదువుకొంటుంటారు. అనేకమంది అనేక రకాల వాఙ్మయంలో ఆసక్తిని ప్రదర్శిస్తుంటారు.

విప్లవానికి పూర్వం నొవొ-జివొతిన్నోయి మొత్తంమీద ఇద్దరే-స్త్రయాబిణా అనే మతగురువు, దుకాణం దారుడు ఉస్కోవ్-వార్తాపత్రికలకు చందాలు కట్టేవారు. ఈనాడు ఉభయ గ్రామాలలోని ప్రజలకు 875 వార్తాపత్రికలు, 219 మ్యాగజైన్లు, ఒక్కొక్క కుటుం

బానికి, ఒకటి, రెండు లేదా అంతకంటే యెక్కువ కాపీలచొప్పున వస్తున్నాయి.

సాయంత్రపుసమయాల్లో గ్రామానికి చెందిన క్లబ్బు ఆహ్లాద కర వాతావరణంతో కూడి ఉంటుంది. రోజు విడిచి రోజు చలన చిత్రాలు ప్రదర్శింపబడుతాయి. తరచు సమిష్టి క్షేత్రగాన సమాజం, లేదా నాటక, జంత్రవాద్య బృందాలు ప్రదర్శన నిస్తుంటాయి. గ్రామంలోని ప్రముఖ గాయకురాలు సాషా దెవిత్స్కాయా, పద్యాలను హాయిగా చదివే బోరిస్ ఫెదరోవ్, రష్యా జానపద నృత్యాలను చేసే సెన్యా మిఖైలోవ్ మొదలైనవారు ప్రజల ఆదరాభిమానాలను చూరగొంటున్నారు.

పదిహేనుమంది డిప్యూటీలను కలిగివున్న గ్రామ సోవియట్ స్థానిక, సాంస్కృతిక వ్యవహారాలను, గ్రామాభివృద్ధి కార్యక్రమా లను నడుపుతుంది. గ్రామ ఆర్థిక వ్యవహారాల విషయంలో శ్రద్ధ గైకొంటుంది. సమిష్టి క్షేత్రంలో ఒక సభ్యురాలైన నదెజ్దా అంత్సి ఫెరోవా, బెరెజోవిస్కీ జిల్లా సోవియట్ సభ్యురాలుగా ఉంటున్నది. అన్నా గోన్చారోవా అనే మరొక సభ్యురాలు మండల సోవియట్ లో సభ్యురాలుగా ఉంటున్నది. ఈ ప్రజా ప్రతినిధులందరు తమ పనిలో, నిజమైన ప్రజాసేవకులుగా నిరూపించుకొన్నారు. ప్రజల శ్రేయస్సే వారి ధ్యేయం.

* * *

షెన్గరోవ్ చిత్రించిన దుర్దశ శాశ్వతంగా అంతరించి పోయింది. నొవా-జివాతిన్నోయి గ్రామ సమిష్టి వ్యవసాయక్షేత్రం దినదిన ప్రవర్ధమానమవుతున్నది.

సమిష్టి క్షేత్రపు యువ ప్రకృతి ప్రేమికులు ఛాయాచిత్రాలు : తెరొ-ఒవనెసోవ్





# సెర్గీ కిరిలోవ్ కట్టిన ఇల్లు

~ ఐ. అగ్రనోవిస్కీ, ఐ. పొల్యానిన్ ~

పెర్మ ఉరల్స్ నగరాలైన స్వెర్ద్‌లోవ్‌స్క్, నిజ్నీ-తాగిల్‌లను కలిపే రోడ్డుమీద మేము కారులో వెళ్తున్నాము. హటాత్తుగా, యించుమించు అప్రయత్నంగా కారు నిలబడిపోయింది. అక్కడ, రోడ్డు చివరను, వింతగా వున్న ఒక చిన్న యిల్లుంది. మా బాల్యంలో మమ్మలను నిద్రపుచ్చడానికి మా అమ్మమ్మలు చెప్పిన దేవతా కథలలో వచ్చేటటువంటి యిల్లది.

మేము చూసిన దాని సుకుమారతను ఛాయాచిత్రాలు సరిగా చూపలేవని మాకు తెలుసును. కాని యీ పత్రిక వెనుక అట్టను, యీ సంచికతో ప్రచురింపబడిన వర్ణ అనుబంధాన్ని చూసినా, యీ దేవతాగృహం గురించి, మీకు బహుశా కొంత తెలియవచ్చును.

ఈ గృహాన్ని నిర్మించిన వాస్తుశిల్పి ఎవ్వరు? ఇది తెలుసుకోవాలని మేము ఆతృత పడ్డాము.

ఈ వాస్తు శిల్పిని అన్వేషిస్తూ దీనిని సృష్టించిన సెర్గీ కిరిలోవ్‌ను, ఆయనకు బాగా తోడుపడిన ఆయన సోదరుడు యూరీనీ, మర్యాదస్తురాలైన ఆయన భార్యనూ, యీ దేవతా గృహానికి యజమానురాలైన ముచ్చటైన మూడేళ్ళమ్మాయినీ కలుసుకున్నాము.

ఈ సృష్టికర్త గురించి మేము విన్న కథ, ఆయన సృష్టికి తీసిపోనంత ఆసక్తి జనకంగా వుంది.

సెర్గీ కిరిలోవ్ వాస్తుశిల్పికాడు, చిత్రకారుడుకాడు, ఇంజినీరు కూడాకాడు. గ్రామపు సమిష్టి క్షేత్రంలో యీయన లోహకారుడు; బొమ్మలు గీయడంలోగాని, చెక్కడంలోగాని, అలంకారాలను తయారు చేయడంలోగాని, యీయన ఎన్నడూ శిక్షణను పొందలేదు;

ఆయనే తన జీవిత కథను చెప్పాడు.

సెర్గీ, యూరీ అన్నదమ్ములు. సెర్గీకి పద్దాలుగేళ్ళు, యూరీకి ఆరేళ్ళు మాత్రమే వున్నప్పుడు వారికి గొప్ప దురదృష్టం ప్రాప్తించింది. ఫాసిజంతో పోరాడుతూ వారి తండ్రి ఇవాన్ కిరిలోవ్ మరణించాడు. యూరప్ ఆసియాల సరిహద్దుకు సమీపంలో వున్న ఉరల్స్‌లోని స్వెర్ద్‌లోవ్ మండలంలోగల కునార్ గ్రామంలో సమిష్టి క్షేత్రాధ్యక్షుడుగా, వారి తండ్రి యుద్ధానికి ముందర వుండేవాడు. యుద్ధం మొదలయ్యాక తండ్రి, ఆయన సోదరుడు మిహాయిల్ విదేశీ దురాక్రమణదారులకు వ్యతిరేకంగా తమ దేశాన్ని రక్షించుకునేందుకు సేనలో చేరేరు. ప్రపంచాన్ని హిట్లరైట్ దారుణాల నుండి కాపాడుతూ మరణించిన లక్షలాదిమంది సోవియట్ ప్రజలలో కిరిలోవ్ సోదరులిద్దరూ వున్నారు.

సెర్గీ, యూరీల తల్లి అలెగ్జాండ్రాను వారి మరణవార్త ఎంతో బాధించడంవల్ల, ఆమె జబ్బుపడి, కృశించిపోయి, నాలుగేళ్ళ తరవాత మరణించింది, దుఃఖంవల్ల.

పద్దెనిమిది సంవత్సరాల ప్రాయంలో సెర్గీ గృహ యజమాని అయ్యాడు. పదేళ్ళ ప్రాయపు తమ్ముడు యూరీ, ముసలి నాయనమ్మ అతని పోషణలో వుండేవారు. తనతమ్మణ్ణి చూసుకుంటూ, నాయనమ్మకు ఉపచారాలు చేస్తూ, కుటుంబం అంతట్నీ పోషించడానికి చాలినంత డబ్బు గడించడం సెర్గీకి కష్టంగా వుండేది. కాని పెద్ద రైతు కుటుంబంగా వుండే సమిష్టి క్షేత్రంలో ఆయన వుంటూ వుండేవాడు. ప్రతిరోజూ ఎవరో ఒకరు వచ్చేవారు సెర్గీకి సాయపడడానికి, వంట చేయడానికి, బట్ట లుతకడానికి, యిల్లు తుడపడానికి, నాయనమ్మకు భోజనం పెట్టడానికి. సెర్గీ కుటుంబ పోషణకు వీలుగా సమిష్టిక్షేత్ర సంఘం అతనికి కమ్మరి కొలిమివద్ద పనిని యిచ్చింది. ఇక్కడ కష్టపడి పని చేసేవారెవరైనా బాగా గడించుకో వచ్చును.

సెర్గీ కష్టపడి పనిచేయడంమాత్రమే కాకుండా, ఎంతో సమర్థుడుగా కూడా తయారయ్యాడు. పని నేర్చుకునేవానిగా ప్రారంభించి ఒక్క ఏడాదిలో పనినంతట్నీ నేర్చుకుని, పూర్తి కమ్మరిగా తయారయ్యాడు. సమిష్టి క్షేత్రపు కమ్మరి, క్షేత్రంలో ఒక ముఖ్య వ్యక్తి।

ఏ పనీ సెర్గీకి చాలా కష్టమైన పనికాదు. అతను ప్రతి ఒక్కటీ చేయగలిగాడు. అతను ఎన్నడూ విసుగు చెందలేదు, ఇంకా పనికోసం, యింకా కష్టమైన, క్లిష్టమైన పనులకోసం కోరేవాడు.

సెర్గీయే యిటువంటి పనిని ఊహించాడు. ఈయన చాలా కాలంగా దీనిని ఆలోచించాడు, కాని తన కలను అమలు జరపలేనేమో అన్న భయంకొద్దీ మొదలు పెట్టలేదు.

ఇప్పుడతని కల సగం నిజమయ్యింది (అది యింకా పూర్తి కాలేదు): కిరిలోవ్ చేతులు ఎంత బాగా పనిచేస్తాయో, అతని భావన యెంత చక్కనిదో మీరే నిర్ణయించుకోవచ్చును.

కిరిలోవ్ యింట్లో మేము చాలా గంటలు గడిపాము, వారి ఛాయా చిత్రాలు తీశాము, ప్రశ్న లడిగాము. ఇల్లు యింకా పూర్తి కాలేదు గాబట్టి అప్పుడే ఛాయా చిత్రం తీయకూడదని కిరిలోవ్ పదే పదే చెప్పాడు;

సాయంకాలం యావత్తు కుటుంబం (నాయనమ్మ కొన్నాళ్ళ క్రిందట మరణించింది) యింటి చుట్టూరా వున్న కట్టమీద కూచుంది, యూరీ రష్యన్ హృదయానికి ప్రీతి పాత్రమైన జాతీయ వాద్యం అకార్డియన్‌ను తీశాడు. మేము చాలా ఆనందగీతాలనూ, విషాద గీతాలనూ విని, చిన్న కిరిలోవ్ మనస్సుకూడా కవితాభరితమైనదని భావించాము. కునార్ గ్రామంనుండి వెళ్ళిపోయేటప్పుడు ఆ చిన్న "లేస్" యింటి సౌందర్యమే కాకుండా, అక్కడ వుందోన్న ఆ నిరాడంబర కుటుంబంలో అంతర్గతంగా వున్న సౌందర్యానికి కూడా ముగ్ధుల మయ్యాము.

*సోవియట్ ప్రజల దృష్టిలో:*

# గాంధీజీ, ఆయన ప్రభావమూ

యశపాల్, గ్రంధకర్త, పత్రికా రచయిత



గాంధిజీ భారత దేశంలో జన్మించినప్పటికీ ఆయన యావత్ప్రపం చానికీ చెందిన వ్యక్తి. ఆయన ప్రేమ, మానవకోటికంతటికీ పరివ్యాప్తమైంది. ఆయన చేసిన పనులు, ఒక్క భారత దేశంలోనే కాదు, దేశదేశాల ప్రజా హృదయాలలో శాశ్వత స్థానాన్ని సముపార్జించుకొన్నాయి.

నేను మాస్కోలో అడుగు పెట్టినప్పటినుంచీ, గాంధీజీపట్ల, ఆయన కృషిపట్ల గాఢమైన ఆసక్తి కలిగివున్న సోవియట్ ప్రజలనేకుల్ని చూడగలిగాను.

అనేక సంఘటనలకు ఆటపట్టయిన ఆయన జీవితాన్నిగురించి, భారత స్వాతంత్ర్య సాధనకై ఆయన నిర్విరామంగా చేసిన ప్రయత్నాల గురించీ, శాంతి, మానవ సంక్షేమాల కాయన చేసిన మహోపకృతిని గురించీ వారు చదివైనా వుంటారు లేదా వినైనావుంటారు.

సోవియట్ ప్రజలు పరతంత్ర బాధను జార్ పరిపాలనలో అనుభవించారు. అందుచేత సహజంగా వారికి భారత ప్రజలు ఏవిధంగా పోరాటం సాగించిందీ, స్వీయ విధానాన్ననుసరించే కావొచ్చు, పరపాలననుంచి, ఆ ప్రభుత్వపు దాస్యంనుంచి ఎట్లా విముక్తం కాగలిగిందీ తెలుసుకోవాలనే ఆసక్తి ఉంది. ఈ విషయంగా గాంధీజీ విశిష్టమైన సేవ చేశారని సోవియట్ ప్రజ లెరుగుదురు. దేశీయులు 40 కోట్ల మందిని మేల్కొలిపి, విదేశ ప్రభుత్వపు దాస్యశృంఖలాలను పటాపంచలుచేసి, దేశం, ఒక బలవత్తర జాతిగా వర్ధమానం కావడానికి అనువుగా పునర్నిర్మించుకోను గాంధీజీ చేసిన అపూర్వకృషిని వారు ఎంతో ప్రశంసిస్తారు. ఒక వైపున లెనిన్, ఇతర సోవియట్ నాయకులు తమ ప్రజల స్వేచ్ఛకోసం పోరాటం సాగిస్తుండడం, ఇంకొక వైపున గాంధీజీ, నెహ్రూ, ఇతర భారత నాయకులు తమ దేశంలోను ఆ లక్ష్య సాధనకే కృషిచేస్తుండడం, ఏకకాలంలో జరిగింది. అందుచేతనే సోవియట్ ప్రజలు గాంధీజీ స్వాతంత్ర్య పోరాటాన్ని ఏవిధంగా నడుపుతున్నదీ కనిపెడుతూ వచ్చారు. వారి దృష్టిలో గాంధీజీ, జాతీయోద్యమంలో పాల్గొని దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడమని ప్రజల కిచ్చిన పిలుపు, ఎంతో విప్లవాత్మకమైనది.

రాజకీయంగా స్వాతంత్ర్యాన్ని సాధించినందుకేగాదు, సోవియట్ ప్రజలకు గాంధీజీ, సాంఘిక, ఆర్థిక రంగాలలో చేసిన కృషి పట్ల ఎంతో గౌరవం ఉన్నది. దానిని వారు బహుళంగా ప్రశంసిస్తారు. ఇంటి నాలుగు గోడలుదాటి, బయటకు రాగలగడానికి స్త్రీలకు ఆయన ఎటువంటి చైతన్యాన్ని, ధైర్యసాహసాలను కల్పించారో వారెరుగుదురు. పురుషులలో ఆత్మ విశ్వాసాన్ని కలిగించినట్లు, స్త్రీలలోనూ ఆత్మ విశ్వాసాన్ని కలిగించి, వారు జీవితానికి సంబంధించిన రాజకీయ, తదితర క్షేత్రాలన్నింటిలోనూ ముందంజ వేయగలిగేటట్టు చేశారు ఆయన.

భారత దేశపు సర్వసమగ్రాభివృద్ధికి ఆయన కృషి చేశారు. ముఖ్యంగా సోవియట్ దేశస్థులకు ఆసక్తిదాయకమైనది మనిషి మనిషినీ వేరుచేసే అడ్డంకులను వారించడానికి ఆయన చేసిన కృషి. ఒక పెద్ద కళంకంలాగా వున్న అస్పృశ్యతను నివారించడం, గాంధీజీ జాతీయోద్యమంలో ఒక భాగంగా చేశారు. ఆయన దృష్టిలో మానవులందరూ ఒక్కటే. మానవకోటిని కుల, మత, భాషా ప్రాతిపదికలపై వేరుచెయ్యడాన్ని ఆయన ఎప్పుడూ సహించలేదు. గాంధీజీ ఎన్నడూ ప్రజలు తమ విస్వాశాలను మార్చుకోవాలని కోరలేదు, కాగా ఆయనకు అన్ని మతాలపట్ల ప్రేమాదరాలున్నాయి. ఎప్పుడూ ఆయన వైవిధ్యంలో ఏకత్వం ఉందన్న విషయాన్ని ఉద్ఘాటించేవారు. ఆ ఏకత్వమొక్కటే ప్రపంచాన్నంతటినీ సహోదర భావంతో సమైక్యపరచగలుగుతుంది.

సోవియట్ దేశంలో వుంటూ నేను, ఏ ఆయుధంతోనైతే గాంధీజీ భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాటం సాగించారో, ఆ ఆయుధమంటే అభిమానం, అహింసపట్ల అపార గౌరవం వున్న సోవియట్ ప్రజల్ని సందర్శించగలిగాను.

గాంధీజీ ఒక మహత్తర దేశభక్తుడు. ఎల్లప్పుడూ ఆయన దేశాన్నీ, దేశీయులనూ ప్రేమించారు. అయితే నేను యింతకు ముందు చెప్పినట్టు, ఆయన ప్రేమ కేవలం తన దేశపు సరిహద్దులకే పరిమితం కాలేదు. ఆ ప్రేమ మానవకోటి నంతటినీ ఆలింగనం చేసుకొన్నది. సోవియట్ ప్రజలకు గాంధీజీ దేశభక్తిపట్ల గురుతరమైన అభిమానాదరణలున్నాయి. భారత దేశ ప్రయోజనాలకోసం, భారత దేశ సేపపట్ల ఆయనకున్న శ్రద్ధాసక్తులే, భారత దేశం, ఆ దేశ ప్రజలు ఒక మహత్తరజాతిగా వెలుగొందగలగడానికి హేతువు కాగలిగాయని వారు భావిస్తున్నారు.

అహింసలాగానే. గాంధీజీ శాంతిని ఎప్పుడూ ప్రేమించారు. సోవియట్ ప్రజలు ఆయనచేత ఆకర్షించబడడానికి కొంత దోహదం

(మిగత 28వ పుట చూడండి)

# శాంతి వర్ధిల్లడానికి ఒక వాస్తవిక మార్గం

మిత్రరాజ్య సమితి జనరల్ అసెంబ్లీయొక్క యిటీవల జరిగిన 12 వ సమావేశంలో సోవియట్ దేశం, తన లెనినిస్ట్ శాంతియుత విధానానికి అనుగుణంగా, అపార ప్రాముఖ్యంగల ప్రతిపాదనలను, శాంతినీ, అంతర్జాతీయ భద్రతనూ పటిష్ఠపరచడానికి మార్గదర్శకాలైన ప్రతిపాదనలను నివేదించింది.

అంతర్జాతీయ సహకారాన్ని యింకా విస్తృత పరిచేందుకూ, అంతర్జాతీయ ఉద్రిక్తతను ఉపశమింప జేసేందుకూ సోవియట్ ప్రతినిధివర్గ అధిపతి ఎ. ఎ. గ్రోమికో, సెప్టెంబరు 20న జనరల్ అసెంబ్లీకి *దేశాల శాంతియుత సహజీవన ప్రకటన* ముసాయిదాను నివేదించారు. తమ పరస్పర సంబంధాలను యీ దిగువ సూత్రాల పైని ఆధారపర్చడానికి జనరల్ అసెంబ్లీ, దేశాలను హెచ్చరించాలని యీ ప్రకటన ప్రతిపాదిస్తున్నది :

1. పరస్పర ప్రాదేశిక అఖండత్వం పట్ల పరస్పర గౌరవం.
2. నిరాక్రమణ.
3. ఆర్థిక, రాజకీయ, లేదా తాత్త్విక స్వభావంగల ఏ ఉద్దేశాలతోనైనా ఒండొరుల ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యం కలుగజేసుకోక పోవడం.
4. సమానత్వం, పరస్పర లాభం.
5. శాంతియుత సహజీవనం.

సోవియట్ దేశం చేసిన యీ ఉదాత్త హెచ్చరిక, ప్రపంచంలోని సకల ప్రజల మూల ప్రయోజనాలకు అనుగుణంగా వుందని సుస్పష్టం.

నిరాయుధీకరణ, సామూహిక మారణాయుధాల నిషేధమూ ఒక కీలక సమస్య; దీనిపరిష్కారంపైననే ప్రపంచ వ్యాప్తంగా శాంతి దిట్టపడడం ఆధారపడివుంటుంది. పశ్చిమ రాజ్యాలు మొండిగా నిరాయుధీకరణ పరిష్కారాన్ని వాయిదాలు వేస్తున్నాయి. నిరాయుధీకరణ సంఘమూ, దాని ఉపసంఘమూ తమ కర్తవ్యాన్ని నెరవేర్చలేదు; నిరాయుధీకరణ విషయమై అగ్రరాజ్యాల మధ్య ఒడంబడికకు అవి ప్రాతిపదికను తయారు చేయలేక పోయాయి. ఇప్పుడు మిత్రరాజ్య సమితి జనరల్ అసెంబ్లీ యీ తక్షణావశ్యకమైన విషయాన్ని తీసుకుని, యీ ప్రతిష్ఠంభనను భగ్నం గావించడానికి ఆచరణయోగ్యమైన పరిష్కార మార్గాలను ఆమోదించాలి. పాక్షిక నిరాయుధీకరణ చర్యల గురించి ఒక విస్తృత పథకాన్ని మిత్రరాజ్య సమితికి నివేదించుట ద్వారా సోవియట్ దేశం మళ్ళీ సుహృద్భావాన్నీ, మన కాలపు యీ తీవ్ర సమస్యను అత్యంత శీఘ్రంగా పరిష్కరించడానికి మనఃపూర్వకమైన ఆసక్తినీ ప్రదర్శించింది.

దానిలో పశ్చిమ రాజ్యాల వేరువేరు దృక్పథాలను గణనలోనికి తీసుకునివున్న, పూర్తిగా సాధ్యమైన, వ్యవహారసరళి ప్రతిపాదనలున్నాయి.

ప్రస్తుతం పశ్చిమరాజ్యాలు పరమాణు, ఉదజని ఆయుధాల ప్రయోగాన్ని పూర్తిగా త్యజించడానికి అంగీకరించ దలుచుకోలేదన్న యదార్థ విషయాన్ని గణనలోనికి తీసుకుంటూ, సోవియట్ ప్రభుత్వం యిటువంటి ఆయుధాలుగల రాజ్యాలు, ఉదాహరణకు ఐదేళ్ళకాలానికి యిటువంటి బాధ్యతను వహించాలని ప్రతిపాదిస్తున్నది. ఈ కాలంలో కూడా నిరాయుధీకరణగురించి విస్తృతమైన ఒడంబడిక యేదీ జరుగకపోయినట్టయితే, ఐదేళ్ళ తరవాత మళ్ళీ యీ విషయాన్ని పునఃపరీక్ష చేయడం సాధ్యమవుతుంది. దాని పరిష్కారాన్ని యితర నిరాయుధీకరణ విషయాలపైని ఆధారపర్చకుండా యీ అంశం వేరుగా పరిశీలింపబడాలని సోవియట్ ప్రభుత్వం భావిస్తోంది. దీనిననుసరించి, సోవియట్ ప్రతినిధివర్గం, *న్యూక్లియర్ ఆయుధాలను ఉపయోగించమని బాధ్యత వహించిన దేశాల గురించి ఒక ముసాయిదా తీర్మానం* అసెంబ్లీకి నివేదించింది.

సోవియట్ దేశ ప్రభుత్వం, పరమాణు ఉదజని ఆయుధ పాటవ పరీక్షలను వెంటనే నిలిపివేయడం అన్న విషయాన్ని వేరుగా పరిశీలించడానికి కూడా ప్రతిపాదిస్తున్నది....

సోవియట్ ప్రతినిధివర్గం నివేదించిన, *అంతర్జాతీయ అజమాయిషీక్రింద పరమాణు, ఉదజని ఆయుధాల పాటవ పరీక్షల నిలుపుదల గురించి ముసాయిదా తీర్మానం*, యీ ముఖ్య సమస్య గురించి వెంటనే ఒక ఒడంబడిక జరగాలని ప్రతిపాదిస్తున్నది.

సంకుచితమైన అల్పప్రాతినిధ్యంతో మిత్రరాజ్యసమితి నిరాయుధీకరణ ఉపసంఘం యీ సమస్యను పరిష్కరించడానికి పూనుకున్నంతకాలమూ, నిరాయుధీకరణ సంభాషణలలో ఏర్పడిన ప్రతిష్ఠంభన భగ్నంకాదని రోజురోజుకూ స్పష్టపడుతోంది. సోవియట్ ప్రభుత్వం అభిప్రాయంలో మిత్రరాజ్యసమితి నిరాయుధీకరణ సంఘం యొక్క, దాని ఉపసంఘం యొక్క సభ్యత్వాన్నీ పెంచవలసిన కాలమాసన్నమయ్యింది, "ప్రచ్ఛన్నయుద్ధ" విధానాన్ని వ్యతిరేకించి, శాంతియుత సహజీవన విధానాన్ని అనుసరిస్తున్న దేశాల ప్రతినిధులను దానిలోనికి తీసుకోవలసిన సమయ మాసన్నమయ్యింది. ఉపసంఘం ఏకాంతంగా పనిచేయకూడదు, నిరాయుధీకరణ సంభాషణలు విస్తృత ప్రచార వాతావరణంలో జరుపబడాలి.

తాము స్వేచ్ఛగా గాలి పీల్చుకునేందుకు వీలుగా, యుద్ధ భయం తొలిగిపోయేందుకు, మానవజాతి శాంతియుత జీవనానికి ఏది భంగం కలిగించకుండా ప్రపంచమంతటా ప్రజాసామాన్యం నిరాయుధీకరణ సమస్య పరిష్కారానికి ఒత్తిడి తీసుకవస్తున్నారు. నిరాయుధీకరణ సమస్యను పరిష్కరించడంలోనూ, రెండవ ప్రపంచ యుద్ధం తరవాత యిది ఎందుకు నెలకొల్పబడిందో ఆ ఆశయాన్ని నెరవేర్చడంలోనూ నిజమైన ప్రగతిని సాధించేందుకు, సోవియట్ ప్రతిపాదనలు మిత్రరాజ్య సమితికి అద్భుతమైన అవకాశాన్నిస్తున్నాయి.

(మిగత 33వ పుటలో)



కజఖస్తాన్ యువజన మహోత్సవంలో పాల్గొన్న సభ్యులు, ఆల్మా-ఆటా వీధిలోని ఒక దృశ్యం

## నెహ్రూకు కాశ్మీరును జ్ఞప్తికితెచ్చిన నగరం

ఆల్మా ఆటాకంటె అందమైన నగరం ప్రపంచంలో ఎక్కడా లేదంటారు, కజఖ్కులు. ఇందుకు మీరు ఒప్పుకోవచ్చు, ఒప్పుకోకపోవచ్చు. కాని ఒక్క విషయం మాత్రం నిజం—ఆల్మా ఆటా అందమైనది। కార్లు, ట్రాలీబస్సులు, బస్సులూ బారులుబారులుగా పరుగుపెత్తుతాయి, తారురోడ్లు వేసివున్న అవెన్యూలలో, పచ్చని చెట్లు కప్పివున్న మూడు నాలుగు అంతస్తుల మేడలకు ప్రక్కగా. ఆల్మాఆటా పార్కుల నగరం. మానవశ్రమకు, దీక్షకూ విజయాన్ని ప్రతిబింబిస్తుంది, యీ విజయం. ఎందుకూ, నలభై ఏళ్ళక్రితం యిక్కడ ఒక్క తారురోడ్డూ లేదు, ఒక్క మోటారుకారు లేదు, విద్యుచ్ఛక్తికాని, కొళాయిలుకాని లేవు.

కజఖ్ జాతీయ సంస్కృతి విజయాన్ని కూడా తెలియజేస్తుందీ నగరం. నిజంగా అద్భుతమైన ఒక సంగీత నాటకశాల, అనేక నాటకశాలలూ, డజన్లకొద్దీ గ్రంథాలయాలూ, సినీమాలూ, క్లబ్బులూ వున్నాయి. ఒక టెలివిజన్ కేంద్రం నిర్మాణంలో వుంది. ఈ నగరంలోని సంస్కృతీ సంస్థలకు యిది ఎంత మాత్రమూ పూర్తి జాబితా కాదు.

ఈ రిపబ్లిక్కులోని సామ్యవాద పరిశ్రమ విజయాన్నికూడా ఆల్మాఆటా ప్రతిబింబిస్తుంది. ఇప్పుడు, యీ నగరంలోని పెద్ద పరిశ్రమ అయిన భారీ యంత్రపరిశ్రమ, సోవియట్ దేశం భారత దేశంలో నిర్మిస్తోన్న ఇనుము-ఉక్కు పరిశ్రమ కొరకు వస్తువులను కూడా తయారుచేస్తోంది.

కజఖ్ ప్రజలకు గర్వకారణమైన యింకో హంశం కూడా వుంది–ఇది అతిథ్య సాంప్రదాయం. భారత దేశం నుండి యీ నగరానికి వచ్చిన చాలా మంది అతిథులకు యీ ఆతిధ్యం గురించి తెలుసును. వారిలో విజ్ఞాన శాస్త్రజ్ఞులు, రచయితలు, పార్లమెంటుసభ్యులు వున్నారు. శ్రీ జవహర్‌లాల్‌నెహ్రూ, శ్రీ

# ప్రజ

సర్వేపల్లి రాధాకృష్ణన్ కూడా యిక్కడికి వచ్చారు. వీరందరూ, తమ హృదయంలోని ఒక భాగాన్ని యీ నగరంలో వదిలివెళ్ళారు.

"ఈ అద్భుత నగరంలో చాలా కాలం వుండాలని నాకుంది, మళ్ళీ యిక్కడికి రాగలనని ఆశిస్తున్నాను. మీనగరం, నా స్వస్థలమైన కాశ్మీరును నాకు జ్ఞప్తికి తెస్తోంది...." అని అన్నారు నెహ్రూ ఆల్మాఆటాగురించి మాటాడుతూ.

## ఆల్తాయ్ మీదుగా విమానంలో

భాగ్యవంతమైన దక్షిణ ప్రాంతం నుండి విమానం బయలుదేరింది. దిగువను పుష్కలంగా ముడి లోహాలుగల ఆల్తాయ్ వుంది. కుడివేపుగా నీలంగా వున్న జైసన్ సరస్సు వుంది. సరిగ్గా మా విమానానికి దిగువను, తమ విస్తారితతో దర్పాన్ని పొందిన పర్వత శ్రేణులున్నాయి. వీటిలో రాగి, బంగారం, వెండి, సీసం, తగరం, ఆంటిమనీ, టిన్ను, పాదరసం వున్నాయి.



కాని జారిస్టు ప్రభుత్వం మద్దత్తుతో విదేశీయులు యీ ప్రాంతాలలో పెత్తనం చెలాయించిన కాలం గడిచి ఎన్నాళ్ళో కాలేదు. బ్రిటిష్, ఫ్రెంచి పారిశ్రామికులు, ముడి

# పరిపాలకులు



లోహాల గనులుగల అల్తాయిలో తిష్ఠవేసుక కూర్చుండేవారు. తమకు భిన్నమైన ప్రయోజనాలుగల ఒక విదేశంలో వారు స్థావరం పెట్టుకున్నారు.

పలస ప్రభువుల తత్త్వం ఎప్పుడూ ఒక్కటే.

"ప్రజలు పేదపడివున్నారా? అయితే మనకేం?"

"గనులలో కార్మికుల పరిస్థితులు దారుణంగా వున్నాయా? కాని అక్కడ పనిచేసేది అనాగరికులైన కజఖ్కులు!"

"వ్యాధులవల్ల చాలామంది కార్మికులు నశించిపోతున్నారా? ఫరవాలేదు. ఇంకొంత మందిని తెచ్చుకుందాం."

గుర్యేవ్, ఎంబాలలోని నూనె, కరగండా, ఇకిబస్తుజ్‌లలోని బొగ్గు, జెజ్కజ్గన్‌లలోని రాగి, రిద్దర్‌లోని వెండి బంగారాలు, జైరెనోవ్స్క్‌లోని సీసం, తగరం-ప్రతిఒక్కటీ విదేశీయుల చేతుల్లోవుండేవి. అదిసై సీసపు గనుల యజమానులలో ఒకడైన ఆంగ్లేయుడు, ప్రిట్‌కు పది లక్షలకుపైగా బంగారు రూబుళ్లసాలు ఆదాయంగావచ్చేది; బొగ్గుగని యజమాని లెంగర్‌కు ఐదులక్షల బంగారు రూబుళ్ళు వచ్చాయి. అల్తాయ్ ముడి లోహపు గనులకు మకుటంలేని మహరాజు, ఆంగ్లేయుడైన ఉర్కుహార్ట్ లక్షోపలక్షలు సంపాదించాడు.

ఇప్పుడీ సంపదంతటికీ యాజమాన్యం ఒక్కరిదే-అది ప్రజ. వారు పరిశ్రమలను

## వి. కుపిస్కో

స్థాపించారు, కొత్త నగరాలను స్థాపించారు. వారు తమ దేశంలో అపూర్వమైన కొత్త సంపదలను కనుగొన్నారు.

## ఇర్తిష్ జలవిద్యుత్కేంద్రాలు

పుష్కలంగా ముడిలోహాలుగల అల్తాయ్‌లో చాలా చోట్ల లోహ నిర్మాణ పరిశ్రమలు, చాలా సంస్థలు, పెద్దగా యాంత్రికీకరణం జరిగిన పెద్ద లోహపు గనులు, కాన్సెంట్రేటింగ్, యంత్ర నిర్మాణ పరిశ్రమలు ఉద్భవించాయి. ఇందువల్ల యీ ప్రాంతం, తన పరిశ్రమకు చవకగా విద్యుచ్ఛక్తిని సరఫరా చేయవలసిన కర్తవ్యాన్ని చేపట్టింది. ఈ విషయంలో అల్తాయ్ పర్వతాలే అదృష్టవశాత్తు మానవునికి సహాయపడ్డాయి. దాని నదులలో బ్రహ్మాండమైన విద్యుత్ ఆధారాలు వుండడంవల్ల.

ఈ శక్తిని పూర్తిగాపొందడానికి, ఇర్తిష్ నెలవేళ్ళ వెంబడిని విద్యుత్కేంద్రావళిని నెలకొల్పడం అవసరం.

నిర్మింపబడనున్న బుక్తర్మా జల విద్యుత్కేంద్రం, వీటిలో మొదటిది. దీని ఎత్తు 97 మీటర్లు. పూర్తి అయ్యాక దాని డాము ఎత్తు యీ విధంగా వుంటుంది. 600 కిలో మీటర్లకుపైగా ప్రాంతంతో దీనికి జలాశ్రయం ఏర్పడుతుంది; యిది జైసన్ సరస్సును పూర్తిగా మింగివేస్తుంది. ఈప్లాంటుకు చెందిన ఆరు జనరేటర్లు రిపబ్లిక్కుకు మూడు వందల కోట్ల కిలోవాట్ గంటలకుపైగా ప్రతి సంవత్సరమూ స్వల్పధరలకు విద్యుచ్ఛక్తిని లభ్యం చేస్తుంది. పెద్దఓడలు, ఇర్తిష్ ఎగువ ప్రాంతాలలో మున్నెన్నడూ కనిపించనంత పెద్దవి, యీ డాము లాకులగుండా పోతాయి.

ఈ ప్రాజెక్టు ప్రధానోద్యోగి మిహాయిల్ ఇన్యుషిన్, దీని సంకల్పన్ని నాకు చెప్పారు. ఈయన వృద్ధుడు, సోవియట్ దేశ సుప్రీం సోవియట్ సభ్యుని బాడ్జి ధరించారు. తన కథను సమాప్తం చేస్తూ నాచేతినుండి నోటు పుస్తకాన్ని, పెన్సిలును తీసుకొని యీ విధంగా టేబులు వ్రాసేరు:

| | కార్మికుల సంఖ్య | నిర్మాణకాలం | వేసినరాయి ఘన పరిమాణం |
|---|---|---|---|
| ఛెఒప్స్ పిరమిడ్ | 100,000 | 25 సం. | 2,600,000 క్యూబిక్ మీటర్లు |
| బుక్తర్మాజల విద్యుత్‌పరిశ్రమ | 2.000 | 5 సం. | 3.300,000 క్యూబిక్‌మీటర్లు |

"ఫరోవా ఛెఒప్స్ పిరమిడ్ పురాతన ఈజిప్టు దేశపు అత్యద్భుత యింజినీరింగ్ ప్రాజెక్టు. ప్రపంచపు ఏడు అద్భుతాలలో ఒకదానిగా యిది పరిగణింప బడింది. నేనిక్కడ

కజకస్తాన్‌లోని ఉస్త్-కమెనొగొర్స్క్ జల విద్యుత్కేంద్రపు ఆనకట్ట తూములు





సరిపోల్చి చూపినది, మా ప్రాజెక్టు స్థాయి గురించి మీకు తెలియ జేస్తుంది" అని చెప్పారాయన.

ఇర్తిష్ జల విద్యుత్ స్థావరపు రెండో విభాగం పూర్తి అయ్యింది. దాని 60 మీటర్ల ఉక్కు, కాంక్రీట్ డాము, ఇర్తిష్‌చే ఉస్త్-కమెనొగోర్స్క్ జల విద్యుత్కేంద్రపు జనరేటర్లను త్రిప్పేటట్టుగా చేసింది.

## కొత్త నగరాలు

అంతర్యుద్ధం, విదేశీ జోక్యం తరవాత 1922 లో దేశం శిథిలావస్థలో వుంది. అయినా రిద్దర్ గని పనివారు, వైట్ గార్డ్ మూకల అవశేషాలను నాశనం చేశాక గనులను పునరుద్ధరించడానికి పూనుకున్నారు.

ఇప్పుడు రిద్దర్ పేరు మారిపోయింది. ఉర్క్ హర్ట్ (పూర్వపు బ్రిటిష్ యజమాని) కార్మికుల మురికి కొంపలున్నచోట యిప్పుడు లెనినోగోర్స్క్ అన్న సామ్యవాద నగరం వుంది. ఈ ప్రాంతంలోని అన్ని గనులూ, ప్లాంటులూ లెనినోగోర్స్క్ లోహ పరిశ్రమల సంస్థలో ఐక్యం గావింపబడ్డాయి.

## పెద్ద బొగ్గు గనుల ప్రాంతం

కరగండా కజఖస్తాన్లోని అన్నిటికంటె పెద్ద బొగ్గుగనుల ప్రాంతం. ఒకప్పుడు ఒక బ్రిటిష్ కంపెనీకి చెందిన కొద్దిపాటి పురాతనపు గనులు మాత్రమే గల—యివి నేలలో గోతులుకంటె అధికమేమీ కాదు—ఉత్త బయళ్ళలో కొద్దిసంవత్సరాలలో యివిలేచాయి.. ఈ ప్రాంతంలోని బొగ్గు నిలవలు, కోక్‌తో బాటుగా చాలా పుష్కలంగా వున్నాయి.

విమానంపైని కరగండా మీదుగా పోతూ.. యిప్పటికే పనిలోవున్న త్రవ్విన గనుల పెద్ద ప్రాంతాన్ని ఎవ్వరైనా స్పష్టంగా చూడవచ్చును. 8 మీటర్ సీమ్స్‌డీప్ షాఫ్ట్ మైనింగ్ యిప్పుడు కరగండాలో పెంపొందింపబడుతూ వుంది.

ఈనాడు యీ సీమ్స్‌ను త్రవ్వే యెంతో బలవత్తరమైన పెద్ద యంత్రాలను, పారలతోనూ, గునపాలతోనూ బ్రిటిష్ గని యజమానుల కోసం ఒకప్పుడు గనులను త్రవ్విన



పైని :
సొకొలోవ్-సర్బాయ్ ఖనిజ సమీకరణ వ్యవస్థకు చెందిన సొకొలోవ్ గనివద్ద త్రవ్వకపు వారు, ఒక ఓర్-సియమ్ (లోహపు అతుకు) కు సంబంధించిన రక్షక చర్యలలో నిమగ్నమైవున్న దృశ్యం

క్రింద:
బుక్‌తర్మా జల విద్యుత్ కేంద్ర (తూర్పు కజకస్తాన్) స్థావరానికి చెందిన వెల్డర్, రహ్మతుల్లా ముకనోవ్



వారి సంతతి నడుపుతోంది.

బపయేవ్ కుటుంబం అనబడే గని పనివారి "వంశం", కరగండాలో నాకు పరిచయం చేయబడింది. పెద్ద బాపై "నల్ల ముఖం" పనిని—ఆ రోజుల్లో గనిపని పనివారిని అలా పిలచే వారు—గత శతాబ్దంలో చేయడం ప్రారంభిం చాడు. ఆయన మొదట "మారియా" గనిలో హాలర్; యీయన మెడలో ఒక కొవ్వొత్తి దీపం వ్రేలాడుతూ వుండగా చతుష్పాదిలాగా బరువైన బొగ్గుబళ్ళను లాగేవాడు. గని పని వారి దీపాన్ని ఆ రోజుల్లో "బు ల్యుక్" అనే వారు. కజఖ్ భాషలో దీని అర్థం "చావు దగ్గర పడుతోం"దని. ఆ రోజుల్లో కొవ్వొత్తు దీపం తరచుగా మండిపోయేది, లేదా మెథేన్ గ్యాసును వ్యాపింపజేసి బద్దలుచేసేది, ఆ దీపాన్ని తీసుక వెళ్ళేవాడూ, అతని తోడి పనివారూ టన్నులకొలదీ రాతి క్రింద మునిగిపోయేవారు.

చివరికి బాపై "బు ల్యుక్"నూ, స్లెడ్ బండినీ, పలుగునూ తన కొడుకు సుందెత్ బాయ్‌కి యిచ్చి వేశాడు. అతనుకూడా తండ్రి లాగనే గని ప ని వా డ య్యా డు. ఇప్పుడు సుందెత్ బాయ్ 26వ నంబరు గనిలో పని చేస్తున్నాడు. ఇందులో పలుగులూ, ముఖ్యంగా స్లెడ్ బళ్ళూ ఎవ్వరికీ జ్ఞాపకం లేవు. బొగ్గును కంబైన్లు త్రవ్వుతాయి, మెకానికల్ కన్వేయర్లు హాపర్లలోనికీ, కార్లలోనికీ నింపుతాయి.

ఈ గని పనివారి కుటుంబపు మూడవతరం వాడైన అయిత్‌కాజీ, సుందెత్‌బాయ్ కొడుకు, వినికిడివల్ల మాత్రమే "బు ల్యుక్" గురించి తెలుసుకున్నాడు. కరగండా గని విద్యాసంస్థలో యీయన పట్టభద్రుడయ్యాడు, యింజినీరుగా పని చేయడానికి వచ్చాడు. నిరక్షరాస్యుడు బాపై మనమడైన అయిత్‌కాజీ ఒక కొత్త గని త్రవ్వకం పద్ధతిని ప్రవేశ పెట్టాడు. అది హైడ్రాలిక్ పద్ధతి. గని కార్మికులకు విరోధి అయిన నీరు యిప్పుడు అతనికి స్నేహితురాలు, మంచి స్నేహితురాలయినట్టుగా వుంది. బలవత్తరమైన దాని ప్రవాహాలు, పెద్ద ఒత్తిడితో త్రవ్వే చోటును బ్రద్దలు చేస్తాయి, బొగ్గును పట్టుకుని, తక్కిన యంత్రాల వద్దకు దానిని తీసుకపోతోంది. అక్కడ అది చిన్న ముక్కలుగా బద్దలు చేయబడుతుంది. ఈ క్రమం చాలా తొందరగా జరగడంవల్ల ఉత్పత్తి బాగా అధిక మయ్యింది. అన్నిటి కంటె ముఖ్య విషయ మేమిటంటే త్రవ్వకం జరిగేచోట ఒక్క మనిషికూడా వుండనక్కర లేదు.



---





పైని: తెమిర్-తావ్లోని కరగండా ఇనుము ఉక్కు కర్మాగార నిర్మాణ స్థావరం దగ్గరి ఒక దృశ్యం

క్రింద: లెనినొగోర్‌స్క్ (తూర్పు కజఖస్తాన్) పర్వతంమీద నుంచి ఒక దృశ్యం. ఓపెన్-కాస్ట్ పద్ధతుల ద్వారా అంద్రియేవ్‌స్కీ సీసపు గనులవద్ద, ఖనిజం వెలికి తీయబడుతున్నది



# 'బోల్షివిక్' ప్రభుత్వక్షేత్రంలో భారతీయ అతిధులు

డాక్టర్ నజర్ సింగ్

సోవియట్ దేశానికి ఇది నా మొట్టమొదటి రాక. బహుకాలంగా ఈ దేశాన్ని సందర్శించాలనీ. సోవియట్ ప్రజలతో, వారి జీవితంతో పరిచయం కల్పించుకోవాలనీ వాంఛిస్తున్నాను.

వారి ఆతిధ్య సత్కారాలు. మానవత. వివిధజాతుల మధ్య శాంతి స్నేహాలు పటుతరం కావాలనే తీవ్రాభిలాష, బాగా నా మనస్సుకు పట్టాయి.

నేను ఒక రైతు కుటుంబంనుంచి వచ్చినవాణ్ని కాబట్టి నాకు ప్రత్యేకంగా ఆసక్తిదాయకమైంది ప్రభుత్వ సమిష్టిక్షేత్రాలలో రైతులు ఎట్లా జీవిస్తున్నదీ కృషి చేస్తున్నదీ తెలుసుకోవడం.

ఆగస్టు 4. 1957 న ఆరవ ప్రపంచ యువజన విద్యార్థి మహోత్సవ ప్రతినిధుల ఒక దళంతోపాటు. "బోల్షివిక్" ప్రభుత్వ క్షేత్రాన్ని సందర్శించే అవకాశం నాకు కల్పించబడింది.

ఈ ప్రభుత్వ క్షేత్రం. మాస్కోకు వందకిలోమీటర్ల దూరంలో నిర్మితమైవుంది. కాయగూరలు మాత్రమే పండిస్తున్నది.

పైన: స్థానిక రేడియో ప్రసారంద్వారా ప్రభుత్వ క్షేత్ర కార్మికులకు, వారిచ్చిన ఘన స్వాగతానికి నజర్ సింగ్ అభివందనాలు చెబుతోన్న దృశ్యం

క్రింద: ప్రభుత్వ క్షేత్ర గ్రంథాలయంలో అభిమాన పాత్రాలైన గ్రంథాలు ఎన్నోవున్నాయి



నేను ముఖ్యంగా పేర్కొనవలసిన విషయం, ప్రభుత్వ క్షేత్ర కార్మికులు మా కిచ్చిన మహోత్సుక స్వాగతం.

ప్రతివ్యక్తీ. ఒక్కరూ మిగిలిపోకుండా. మమ్మల్ని అభినందించడానికి వచ్చారు. "హిందీ రూసీ భాయ్, భాయ్!" అన్న నినాదాలు అంతటా మార్మోగాయి.

మాకు స్వాగతమిస్తూ వారు చూపిన ఆదరాభిమానాలు, నన్ను ఎంతో కదలించి వేశాయి. ఈ జ్ఞాపకాలు ఎప్పటికీ నాకు మనోహరంగా, ప్రేమ ప్రదంగా నిలచి వుంటాయి.

ప్రభుత్వ క్షేత్ర కృషి అంతా యాంత్రికీకృతమైంది. శరీర శ్రమతో కూడిన పని యించుమించుగా లేదు.

వివిధ వ్యవసాయ యంత్రాలు. విత్తులు చల్లేవి. కోతలు కోసేవి, రసాయనిక ఎరువులు వేసేవి. పురుగు పట్టకుండా మందు జల్లించేవి. పొలాలకు నీరు కట్టేవి తీరుతీరుల పని చేస్తుండడాన్ని శ్రద్ధాశక్తులతో గమనించాము.

ప్రభుత్వ క్షేత్రానికి. శాస్త్రీయ విషయాలలో అనుభవజ్ఞులైన కార్యకర్తలు నియామకమై వున్న ఒక పరిశోధనాలయం వుండడం ప్రత్యేకంగా విశేషించి చెప్పవలసినది.

సోవియట్ విజ్ఞానశాస్త్ర పరిశోధనలన్నీ. క్షేత్ర భూసారాన్ని పెంపొందించడానికీ. వ్యవసాయోత్పత్తిని అధికంచెయ్యడానికీ సాధ్యమైనంతవరకు వినియోగించుకోబడ్డాయి.

(మిగత 33వ పుట చూడండి)



పైన: కూరగాయలకు పట్టే క్రిమి కీటక నివారక యంత్రపు నడకను పరిశీలిస్తోన్న అవతార్ సింగ్

మధ్య: "మా ప్రభుత్వ క్షేత్రంలో పండించబడిన యీ టొమాటోలను దయచేసి రుచిచూడండి"



క్రింద: అప్పుడే పిండిన పాలు, భారతీయ అతిధులకు ఎంతో ప్రీతిపాత్రమైనాయి

ఛాయాచిత్రాలు: వై. గోల్డిన్

# విద్యార్థి "రిపబ్లిక్"లో

వి. కుద్రియవ్త్సెవ్

ఆరవ యువజన విద్యార్థి ఉత్సవానికి సంబంధించిన అంతర్జాతీయ విద్యార్థి క్లబ్బులో కొల్లలుగా ఉల్లాసం వెల్లివిరిసింది; ఆటలూ, పాటలూ మారుమ్రోగాయి. ఇంతేకాదు, గంభీరోపన్యాసాలూ, చర్చలు, సభలూ కూడా చాలా జరిగాయి.

మాస్కో ఉత్సవంలో మొదటిసారిగా అంతర్జాతీయ విద్యార్థి క్లబ్బు నెలకొల్పబడింది. లెనిన్ కొండల పైనున్న మాస్కో విశ్వవిద్యాలయం భవనంలో అది నెలకొల్పబడింది. క్లబ్బు కార్యకలాపాలలో చర్చలూ వివిధ రంగాలలోని విద్యార్థుల గోష్ఠులూ కూడా జరిగాయి.

వలస విధాన వ్యతిరేక పోరాటంలో విద్యార్థుల పాత్రగురించి జరిగిన చర్చ ఎంతో ఆసక్తిజనకమైనది. రెండునాళ్ళు జరిగిన యీ చర్చలో మెడగాస్కర్, ఈజిప్టు, గ్రీస్, సోవియట్ దేశం, వెనిజులా, కాంబోడియా, సుడాన్, బొల్వియా, ఇజ్రయిల్ మొదలైన దేశాల విద్యార్థులు పాల్గొన్నారు.

ఫ్రాన్సులో చదువుతున్న నల్ల ఆఫ్రికన్ విద్యార్థి సమాఖ్య ప్రతినిధి కుతుక్లునోయ్ "వలసవిధాన చరిత్ర, అన్యాయపు చరిత్ర, సిగ్గుమాలినతనం, రక్తపాతాల చరిత్ర. విదేశీ పీడనను వదుల్చుకునేందుకు తమ ప్రజలకు తోడుపడడం, విద్యార్థుల కర్తవ్యం" అన్నాడు.

ఈ క్లబ్బును నిర్మించిన వారు దానిని ఒకవిధమైన "చిన్న విద్యార్థి రిపబ్లిక్కు"గా తయారుచేయాలనుకున్నారు; వివిధ దేశాల విద్యార్థులు తమ ఆచార వ్యవహారాలను, అలవాట్లనూ, ముఖ్యంగా తమ వ్యక్తిత్వాన్ని దీనిలో ప్రదర్శించగలిగి వుండాలని వీరు భావించారు.

పగలు చర్చలూ, గోష్ఠులూ సాగాయి. సాయంకాలాల మాటేమిటి?

సాయంకాలాల్లో కుప్పతిప్పలులా సంగీతలహరి. తన తోడి భాగస్తునితో ఒక పొడవాటి స్వీడిష్ యువకుడు రాక్ యన్ రోల్ నృత్యం చేయడం మీకు కనిపిస్తు ది. ఉద్దేశపూర్వకంగా అతని ముఖం భావరహితంగా వుంది. ప్రక్కగదిలో యిద్దరు బల్గేరియన్ విద్యార్థులు వాల్ట్ సంగీతం గానం చేస్తున్నారు. పెద్ద సమావేశ మందిరానికి వస్తే, బ్రిటిష్ విద్యార్థులు ఉల్లాసంగా సంగీత ప్రదర్శనం చేస్తూ వుండడం మీకు కనిపిస్తుంది.

మేమొక ఫోయర్‌గుండా వెళ్ళాము. అక్కడనొక ప్రసిద్ధ ఫ్రెంచి వాగ్గేయకారుడు పాటలు పాడుతున్నాడు. అక్కడనుండి క్లబ్బు హాలుకు వెళ్ళాము. పోలిష్ విద్యార్థుల "బిమ్ బోమ్" బృందం ఒక ప్రదర్శనం చేస్తోంది.

ప్రదర్శనానంతరం యీ బృందంలోని ఇవా క్విరిన్‌కు, అలన్ స్కోవర్‌కూ మేము పరిచయం చేయబడ్డాము. ప్లాస్టిక్ కళా సంస్థ విద్యార్థులు వీరు. తమకు యీ ఉత్సవం ఎంతో నచ్చిందని వీరన్నారు.

ఉత్సవం రోజుల్లో క్లబ్బులో పదిహేను సినిమా ప్రదర్శనలు ఏర్పరుపబడ్డాయి. మేము క్లబ్బుకు వెళ్ళినప్పుడు ఫ్రెంచి సినిమా ప్రదర్శనం జరుగుతోంది. ఒక ఫ్రెంచి సినిమా తార, అప్పుడే ప్రదర్శింపబడిన "అనుకోకుండా వచ్చిన బావు" అన్న ఫిల్ములో తన పాత్రను గురించి ప్రేక్షకులకు తెలియజేస్తోంది.

మేము క్లబ్బునుండి బయలుదేరవలసిన సమయమయ్యింది. మేము ద్వారంవేపు వెళ్ళాం. కొత్త స్నేహాలు ప్రారంభమవుతూ వుండడం మా చుట్టూరా కనిపించింది. ఒక రష్యన్ విద్యార్థి ఒక సుడాన్ విద్యార్థితో కరచాలనం చేస్తున్నాడు. ఒక కొరియన్ బాలిక ఒక ఫిన్నిష్ విద్యార్థినిని కౌగలించుకుంటోంది. కొంతమంది బ్రిటిష్, చెక్ విద్యార్థులు చెట్టపట్టాలు పట్టుకుని వెళ్తున్నారు. సంతృప్తితో మేము క్లబ్బునుండి బయలుదేరాము — ఆచరణలో విద్యార్థుల స్నేహ సహకారాలను చూశామన్న సంతృప్తితో.





# గడచిన దారి


## సెర్గీ అలెగ్జియేవ్

చరిత్రకారుడు, గ్రంథకర్త


అంతర్యుద్ధం అంతమొందింది. జోక్యందార్లు రష్యానుండి తరిమివేయబడ్డారు. అయినప్పటికి, సామ్రాజ్యవాదులు సోవియట్ రష్యాను గుర్తింప నిరాకరించారు. ఇతర ప్రపంచంనుండి దూరం చేయడానికి, దానిని బహిష్కరించారు.

శైశవావస్థలోనున్న ప్రభుత్వానికిది అతి గడ్డుదశ. యుద్ధ విధ్వంసనకు లోనైన దేశప్రజలు కరువుకు గురిఅయ్యారు : రొట్టె, తదితర ఆహార వస్తువులు అరుదయ్యాయి. 1920 లో ఉత్పత్తి యుద్ధానికి పూర్వపు మొత్తంతో పోల్చిచూస్తే సగానికి పడిపోయింది. అంతేగాక, అనేక ప్రాంతాల్లో పంటలు దెబ్బ తిన్నాయి. అనేక ఫ్యాక్టరీలు శిథిలావస్థలో ఉండిపోయాయి. బాగా వున్నవి కూడా ఇంధనం, ముడిసరుకులు లేక మూలపడ్డాయి. మొత్తం ఉత్పత్తి పూర్వపుస్థాయికి యేడింట ఒక వంతుకు పడిపోయింది. రవాణా పరిస్థితి అంతా తారుమారయింది.

అత్యంత త్వరితగతిని ఆర్థిక పునరుద్ధరణను గావించక పోయేటట్లయితే, విధ్వంసనను యెదుర్కొనవలసిన సమస్య యెదురయ్యింది. ఈ పరిస్థితులలో, సోవియట్ ప్రజలు తమ జీవితావసరాలను గూడా కొన్నింటిని త్యాగంచేసి తమ సర్వశక్తులూ వినియోగించి కృషికి పూనుకున్నారు. 1926 కల్లా పారిశ్రామికోత్పత్తి యుద్ధాత్పూర్వపు స్థాయికి తీసుకొనిరాబడింది. అదొక మహా విజయం: యెంతటి మహా విజయమైనప్పటికి ఇంకా చేయవలసినది యెంతో ఉండినది.

పారిశ్రామికోత్పత్తిలో జారిస్ట్ రష్యా ప్రపంచంలో ఐదవ స్థానాన్ని ఆక్రమిస్తూ ఉండేది. ఆర్థిక, సాంకేతిక విషయాలలో అది బాగా అభివృద్ధి పొందిన దేశాలపై ఆధారపడి ఉండేది. ఆ వెనుకబాటు తనాన్ని దాటుకురావలసి వచ్చింది. కాని యెలా ?

భారీ పరిశ్రమలను నిర్మించుకొనుటద్వారా దానిని అధిగమించవచ్చునని లెనిన్ బోధించారు.

భారీ పరిశ్రమలు లేకపోయినట్లయితే దేశ స్వాతంత్ర్యాన్ని కాపాడుకొనడము, ఆర్థికంగా శక్తివంతమైన దేశంగా దానిని రూపొందించుకోవడము అసాధ్యమని లెనిన్ నేర్పారు. పార్టీ లెనిన్ చెప్పిన విధానాన్ని అనుసరించింది.

అది సామాన్యమైన పనిగాదు. పెద్ద పెట్టుబడులు అవసరమయ్యాయి. పెట్టుబడిదారి దేశాలు వలస దేశాలను కొల్లగొట్టుట ద్వారా, పన్నులను హెచ్చించుటద్వారా, విదేశీ అప్పులద్వారా అవసరమైన ధనాన్ని సేకరిస్తాయి. సోవియట్ ప్రభుత్వానికి విదేశీ అప్పులు నిరాకరింపబడ్డాయి. మూల ధనాన్ని సేకరించే యితర మార్గాలు దానికి సరిపడలేదు.

అందువల్ల సోవియట్ ప్రజలు యితర అవకాశాలను కనుగొన్నారు. భూమి, ఫ్యాక్టరీలు, రవాణా సౌకర్యాలు అంతా వారి సొత్తయ్యాయి. వీటినుండి వచ్చిన ఆదాయం జాతీయార్థికాభివృద్ధికి పెట్టుబడిగా వినియోగింపబడింది. సోవియట్ ప్రభుత్వము, రైతులు



స్టాలిన్‌గ్రాడ్ ట్రాక్టర్ నిర్మాణ కర్మాగారంలో తయారైన మొట్టమొదటి ట్రాక్టర్, 17-7-1930

భూస్వాములకు పన్ను చెల్లించ నవసరంలేకుండా మినహాయించింది. భారీ పరిశ్రమల నిర్మాణానికి జరిపేకృషిలో వారుకూడా పాల్గొన్నారు. శ్రామిక ప్రజలు ప్రభుత్వ ఋణాలకు డబ్బునిచ్చారు. దేశ పారిశ్రామీకరణ విజయవంతం కావడానికి అదికూడా దోహదమిచ్చింది.

1928 వచ్చేటప్పటికల్లా సోవియట్ ప్రభుత్వం ప్రథమ పంచవర్ష ప్రణాళికను ప్రారంభించగలిగేస్థితికి వచ్చింది.

## ప్రజలు అద్భుతాలను చేశారు

ఉరల్స్‌లోని మాగ్నిత్నయా పర్వతంలో ఉన్నత తరగతికి చెందిన ముడిఇనుము నిధులు సమృద్ధిగాఉన్నాయి. అక్కడ ఉక్కు యంత్రాగారాలను నిర్మించడానికి సోవియట్ ప్రజలు నిర్ణయించుకొన్నారు.

మొట్టమొదటి నిర్మాతలు అనేక యిక్కట్లను యెదుర్కొనవలసి వచ్చింది. అయినప్పటికి రెండు సంవత్సరాలలోపల వారి కృషి ఫలించసాగింది. ఒక బ్రహ్మాండమైన అధునిక ఉక్కు యంత్రాగారమేగాక, మాగ్నితొగోర్స్క్ అనే ఒక కొత్త నగరం కూడా మాగ్నిత్నయా పర్వతం దగ్గర వెలిసింది.

ధాన్యం, కలప, పత్తి, లోహం, బొగ్గు చాలా అవసరమయ్యాయి. సైబీరియాలో కలప, ధాన్యం సమృద్ధిగా ఉన్నాయి. కాని పత్తిలేదు. దక్షిణాన చాలా దూరంలో మధ్యఆసియా రిపబ్లిక్‌లు



ఒక గ్రామంలోని పైరైన్. 1925

ఉన్నాయి. వాటిలో కావలసినంత పత్తి. కాని వారికి ధాన్యము, కలప అవసరము. సైబీరియాకు, మధ్య ఆసియాకు నడుమనున్న యెడారిని ఒంటెలు మాత్రమే దాటగలవు. అక్కడ రైల్వే లైనును వెయ్యడానికి సోవియట్ ప్రజలు నిశ్చయించుకొన్నారు. మధ్య ఆసియాప్రజలతోపాటు రష్యన్లు. ఉక్రేనియన్లు. బైలోరష్యన్లు తదితర జాతుల ప్రజలుకూడా యీ రైలుమార్గ నిర్మాణంలో పాల్గొన్నారు. రెండు సంవత్సరాలు గడిచేటప్పటికల్లా తుర్కిస్తాన్-సైబీరియన్ రైల్వే మార్గంపైన రైళ్ళు నడవడం ప్రారంభించాయి.

నేపియర్ నదిని అదుపులోకి తెచ్చుకోడానికి పూనుకొన్నారు. 1932లో అక్కడనే ప్రొగ్రెస్ అనే ఒక అతిశక్తివంతమైన జల విద్యుత్ కేంద్రం నిర్మింపబడింది. జారిస్టు రష్యాలోని అన్ని విద్యుత్ కేంద్రాలు కలసి ఉత్పత్తి చేస్తూవుండిన దానికంటే మించి విద్యుత్‌ను ఉత్పత్తి చేయసాగిందది.

సోవియట్ ప్రజలు రష్యన్ దూరప్రాచ్యప్రాంతంవైపు కూడా తమదృష్టిని మళ్ళించారు. ఇరవై ఐదు సంవత్సరాల క్రితం యీ దూరప్రాచ్య ప్రాంతాభివృద్ధి కొరకు ఒక బ్రహ్మాండమైన యువజనోద్యమం ప్రారంభమయింది. యువకులైన నిర్మాతలు ఒక కొత్త నగరానికి పునాదులు వేశారు. పసిఫిక్ సముద్రతీరానికి సమీపంలో దిగువ అమూర్ ప్రాంతంలో కొమ్సొమోల్స్క నగరం లేచింది.

మాగ్నిటోగోర్స్క ఉక్కు యంత్రాగారాలు, తుర్కిస్తాన్-సైబీరియన్ రైల్వే, నేపియర్ జలవిద్యుత్కేంద్రం, అమూర్ తీరంలోని కొమ్సొమోల్స్క-యా-ఇవి సోవియట్ దేశంలో నిర్మించబడిన మొట్టమొదటి ప్రాజెక్టులలో కొన్ని.

జారిస్టు రష్యాలో మోటారుకార్ల ఉత్పత్తి పరిశ్రమ లేనేలేదు ఇప్పుడు సోవియట్ రష్యా వివిధరకాలైన మోటారుకార్లను ఉత్పత్తి చేస్తుంది. సోవియట్ ప్రభుత్వం తన స్వంత విమానాల ఉత్పత్తి పరిశ్రమను నిర్మించుకొన్నది. వ్యవసాయిక యంత్రాలను ఉత్పత్తి చేయడానికి అనేక యంత్రాగారాలను స్థాపించింది. మాదేశం అనేక రకాలైన లేతులను. యంత్రాలను ఉత్పత్తి చేయడం ప్రారంభించింది. 1932 కల్లా. అనగా ప్రథమ పంచవర్ష ప్రణాళిక అంత్యానికల్లా యంత్రాల ఉత్పత్తి విప్లవానికి పూర్వపు ఉత్పత్తికి పదిరెట్లకు మించింది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక సమయంలో పారిశ్రామిక నిర్మాణం ఇంకా ఉన్నత స్థాయిని అందుకున్నది. వెనుకబాటు తనములో ఉన్న రష్యా ఒక మహత్తర పారిశ్రామిక శక్తిగా రూపొందింది.

## సమిష్టి వ్యవసాయ క్షేత్ర రైతులు

సోషలిస్టు పరిశ్రమలను నిర్మిస్తున్న సోవియట్ ప్రజలు రష్యన్ గ్రామాలను వెనుకబాటుతనంలో ఉండనివ్వలేకపోయారు.

చిన్న చిన్న మడులుగా భూమి సేద్యం చేయబడడంవల్ల దారిద్ర్యం ఎన్నటికి అంతరించదని లెనిన్ హెచ్చరించారు. చిన్న మడులలో యంత్రాలను ఉపయోగించడం సాధ్యంకాదు. యంత్రాలను ఉపయోగించనిదే భూమిని సరిగ్గా సేద్యం చేయడం సాధ్యపడదు. ఈ కారణాలన్నిటి మూలంగా, విప్లవానంతరం రైతులు సమిష్టిగా భూమిని సేద్యం చేసేందుకు సహకార సంఘాలను స్థాపించుకొన్నారు. దానిమూలంగా వారికి అనవసరపుశ్రమ తగ్గడమేగాక లాభాలుకూడా అధికమయ్యాయి.

ప్రభుత్వం వ్యవసాయిక యంత్రాలను ఉత్పత్తిచేసే యంత్రాగారాలను నిర్మించడం ప్రారంభించింది. ప్రథమ పంచవర్ష ప్రణాళికాకాలంలో స్టాలిన్‌గ్రాడ్ ట్రాక్టర్ యంత్రాగారం పని ప్రారంభించింది. ఖార్కోవ్, చెల్యాబిన్స్క యంత్రాల నిర్మాణం మొదలయింది. ట్రాక్టర్లు. తదితర యంత్రాలు గ్రామాలకు రావడంతో రైతులు తమ స్వీయానుభవంతోనే సమిష్టి కృషి యొక్క లాభాలను గుర్తించారు. 1929 వసంత ఋతువు మొదలుకొని మొత్తం గ్రామాలకు గ్రామాలే సమిష్టి వ్యవసాయ క్షేత్రాలుగా ఏర్పడసాగాయి. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు పెద్దపెట్టున ఏర్పడడానికి అదే ప్రారంభ దశ.

మరికొన్ని సంవత్సరాలు గడిచాయి. పంటలు బాగా పండడం మొదలు పెట్టాయి. దానితోపాటు రైతుల ఆదాయంకూడా పెరుగసాగింది. 1940 కల్లా పంట 1913 నాటి పంటకంటే నూటికి 350 రెట్లు అధికమయ్యింది. గ్రామాలలో పాఠశాలలు, హాస్పటల్‌లు, క్లబ్బులు తెరువబడ్డాయి. వ్యవసాయంగూడా పరిశ్రమలతో పాటు సోషలిస్టు మార్గంలో అభివృద్ధి పొందసాగింది.

## మరొక విప్లవం

పరిశ్రమలను, వ్యవసాయాన్నీ ఇంకా అభివృద్ధి చేయడానికి, పిల్లలకు విద్య గరపడానికీ అనేకమంది ప్రవీణులు అవసరమయ్యారు.

సోవియట్ ప్రభుత్వం స్థాపితమైనది మొదలు ఒకటి తర్వాత

ఒకటిగా కొత్త పాఠశాలలను ప్రారంభిస్తూ వచ్చింది. చిట్టచివరికి కార్మికులు, రైతుల బిడ్డలకు విద్య లభించే భాగ్యం కలిగింది.

కాని నిరక్షరాస్యులైన వయోజనుల మాటేమిటి? వాళ్ళకు గూడా పాఠశాలలు ప్రారంభింపబడ్డాయి. వాటిని లిక్‌బెజ్ పాఠశాలలు (అనగా, నిరక్షరాస్యతను తొలగించే పాఠశాలలు) అని వాటిని పిలిచేవారు. పగలంతా పనులు చేసుకొన్న తర్వాత వయోజనులు సాయంత్రము పాఠశాలలకు వెళ్ళి చదువు నేర్చుకొనేవారు.

1930 కల్లా అప్పుడే సార్వజనీన (నాలుగు సంవత్సరాల) ఎలిమెంటరీ విద్యకు పునాది వేయబడింది. ఈ పని 3-4 సంవత్సరాలలోపల దేశమంతటా అమలు జరుపబడింది. ఈ పనే, జారిస్టు అధికారుల అంచనాల దృష్ట్యా అయితే 125 సంవత్సరాలలోగాని పూర్తి అయి వుండేది కాదు.

దేశంలోకల్లా పెద్ద గ్రంధాలయమయిన లెనిన్ గ్రంధాలయానికి మాస్కోలో కొత్త భవనం నిర్మింపబడింది. సోవియట్ దేశంలో ప్రకటితమైన పుస్తకాలు, వార్తా పత్రికలు, మ్యాగజైన్లలో యేవైనా, విదేశాలలో ప్రకటితమైన పుస్తకాలలో గూడా అనేకం అడిగినదే తడవుగా యీ గ్రంధాలయంలో లభిస్తాయి. దేశం మారుమూల ప్రాంతాలలో గూడా కొత్త గ్రంధాలయాలు, క్లబ్బులు, నాటకశాలలు ప్రారంభింపబడ్డాయి. సోవియట్ దేశంలో 111 భాషలో గ్రంధాలు ప్రకటింపబడడం ప్రారంభమయింది.

సోవియట్ దేశంలో బాలల విద్య, పరిపోషణల విషయంలో ప్రత్యేక శ్రద్ధ వహింప బడింది. బాలోద్యానవనాలు, శిశుపోషణాలయాలు, బాలల ఆరోగ్య కేంద్రాలు నిర్మించడానికి చర్యలు తీసుకొనబడ్డాయి. బాలల గ్రంధాలను ప్రకటించేందుకు డెత్‌గిజ్ అనే ఒక ప్రత్యేక ప్రచురణ సంస్థ మాస్కోలో ప్రారంభింప బడింది. ఒక్క ఈ ప్రచురణాలయమే సంవత్సరానికి ఏడుకోట్ల పుస్తకాలను ప్రకటిస్తున్నది.

ఈ విధంగా సోవియట్ ప్రజలు నిర్మాణాలను జరుపుకొంటూ, పని చేసుకొంటూ, విద్య నభ్యసిస్తూ ముందుకు సాగిపోసాగారు. 20 సంవత్సరాల లోపల దేశంలో మహత్తరమైన మార్పులు జరిగాయి. ఇది మరొక విజయం. ఇదే సాంస్కృతిక విప్లవం.

## అన్ని చోట్లా జీవితం మార్పు

సోవియట్ దేశంలో ఆగ్నేయ దిశను మధ్య ఆసియా రిపబ్లిక్‌లు వున్నాయి. ఈ రిపబ్లిక్‌లలోని భూమి శతాబ్దాలుగా నీటికొరకై తహతహలాడుతూ వున్నది.

1917 అక్టోబరు విప్లవానంతరం నదులు, పొలాలు, జలాశయాలు ప్రజల సొత్తయ్యాయి. ఈ ప్రాంతపు ప్రజలు తమ భూమిని సుసంపన్నం చేసుకోడానికి పూనుకొన్నారు. రైతులు తమకున్న భూమి నంతటినీ కలిపి సమిష్టిగా సేద్యం చేయడానికి సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను స్థాపించుకొన్నారు. ఈ భూమికి నీటి పారుదలను కల్పించడానికి వందలాది కాలువలు త్రవ్వబడ్డాయి. ఒక్క ఫెర్ఘనా కాలువయే 270 కిలోమీటర్ల పొడవు వుంటుంది. 160,000 మంది జనం దానిని త్రవ్వారు. పూర్వకాలంలోనైతే అలాంటి కాలువను త్రవ్వడానికి యెన్నో సంవత్సరాలు పట్టి వుండేది. కాని సోవియట్ ప్రజలు దానిని 45 రోజుల్లో త్రవ్వారు.

సోవియట్ ప్రభుత్వం క్రింద కాకసస్‌లలో వుండే ప్రజల జీవితంలో పూర్తిగా మార్పులు వచ్చాయి. నూనె గనులు, నము

డ్నీపర్ డామ్ ప్రాంగణంలో ఒక కార్మికుడు కిచ్‌కాస్ 1930-31



ద్రము, భూమి, పర్వతాలు ప్రజల సొత్తయ్యాయి. అంతేకాదు : శతకాలంగా వుంటూ వచ్చిన వైషమ్యాలు, వివిధప్రజలమధ్య వుంటున్న అవిశ్వాసం, సమూలంగా తొలగించి వేయబడ్డాయి. అన్ని జాతుల ప్రజలకు సమాన హక్కులు యివ్వబడ్డాయి. సోషలిస్టు నిర్మాణం యొక్క ఫలితాలు, 1936 డిసెంబరులో సోవియట్ ప్రజలు ఆమోదించిన రాజ్యాంగ చట్టంలో సమీక్షింప బడ్డాయి.

సోవియట్ దేశంలో పరులను దోచుకొనే వర్గాలు ఉన్నాయా? లేదు, ఇక్కడ ఆ వర్గాలు అస్తిత్వంలో లేవు. అలాంటివి ఉండడానికి వీల్లేదు. మా దేశంలో శ్రామిక ప్రజలు, కార్మిక, కర్షకులే దేశంయొక్క యజమానులు. సోవియట్ ప్రభుత్వము కార్మికులు, కర్షకుల సోషలిస్టు ప్రభుత్వం. శ్రమిక ప్రతినిధుల సోవియట్లచేత అది నడుపబడుతున్నది. రాజ్యాంగ చట్టంలో యిది స్పష్టంగా వివరింప బడింది.

వివిధ ప్రజల మధ్య వైరుధ్యాలుగాని, ఒక జాతి ప్రజలు మరొక జాతిని దోచుకొనడంగాని ఇక్కడ వున్నదా? లేదు. సోవియట్ దేశంలో అన్ని జాతుల ప్రజలకు సమాన హక్కులున్నాయి. సోదర మైత్రీ భావంతో జీవిస్తున్నారు.

జారిస్టు రష్యాలో ప్రజలు దారిద్ర్యంతో క్రుగ్గి పోతుండేవారు. బ్రతుకు చితికి, భూమినుండి తొలగింపబడిన రైతులు బ్రతుకుతెరువు కోసం తండోప తండాలుగా నగరాలకు చేరేవారు. యంత్రాగారాల యజమానులు కార్మికులను తమ ఇష్టానుసారం పనిలోంచి తొలగించి వేస్తూ, బ్రతుకుతెరువు లేకుండా చేస్తుండేవారు. ఆ రోజుల్లో నిరుద్యోగు లనేకంగా వుండేవారు. ఈ రోజున మాదేశంలో నిరుద్యోగులున్నారా? లేరు. ఈ శతాబ్దం నాల్గవ దశాబ్దిలోనే నిరుద్యోగం అంతరింపజేయ బడింది. నూతన రాజ్యాంగ యంత్రం ద్వారా ప్రజలకు ఉద్యోగానికి హక్కు ప్రసాదింప బడింది.

మా దేశంలో నిరక్షరాస్యతకు స్థానం లేదు. ప్రతివారికి విద్యాభ్యాసానికి హక్కు, అవకాశాలు వున్నాయి. ప్రజలకొరకు అనేక పాఠశాలలు, ఉన్నత విద్యాసంస్థలు ప్రారంభింప బడ్డాయి. శ్రామిక ప్రజలకు విశ్రాంతి విరామాల హక్కు, తదితర హక్కులవలెనే సోవియట్ దేశ రాజ్యాంగ చట్టం విద్యా హక్కునుగూడా ప్రసాదించింది.

నూతన రాజ్యాంగ చట్టం, ఒక వర్గంనుండి వచ్చిన వారన్న కారణంతో యెవ్వరి హక్కులపైనా నిర్బంధాలను పెట్టదు. జాతులు, తెగ, మత, విద్య, సాంఘిక మూలం, గత కార్యకలాపాలతో ప్రమేయం లేకుండా 18 సంవత్సరాలు దాటిన ప్రతివ్యక్తికి ఓటు చేయడానికీ, ఎన్నికల్లో నిలబడడానికి హక్కు వున్నది.

సోవియట్ ప్రజలు సోషలిజం నిర్మాణాన్ని పూర్తి చేయసాగారు. 1938 లో ఇంకా బ్రహ్మాండమైన మరొక జాతీయార్థిక పథకం ప్రారంభింప బడింది. తలొక్కింటి ఉత్పత్తి విషయంలో ప్రధాన పెట్టుబడిదారి దేశాలను అధిగమించడమే ఆ పథకంయొక్క ఉద్దేశ్యం. కాని సోవియట్ దేశ పశ్చిమ సరిహద్దులో అప్పటికే యుద్ధపు కారు మేఘాలు కమ్మసాగాయి. సామ్రాజ్యవాద ప్రపంచం సోవియట్ రష్యాను మరింత భయంకరమయిన పరీక్షకు గురి చెయ్యడానికి సన్నద్ధం కాజొచ్చింది. యుద్ధం మూలంగా దాని విజయవంతమైన అభివృద్ధికి ఆటంకం కలిగింది.

తుర్క్‌మెన్ సైబీరియాలోని ప్రధానమైన రైలుదారికి చిట్టచివరి పనులు పూర్తి చేయబడుతోన్న దృశ్యం, 1930.



# ప్రథమ దశాబ్దం*

ఎల్. యెకిమెంకో

అసిస్టెంట్ ప్రొఫెసర్, సోవియట్ రచయితల సంఘ సభ్యుడు

**1917** అక్టోబరు విప్లవం, రష్యాలో జీవించే జాతుల జీవితంలోనే కాకుండా, సారస్వత, కళాభివృద్ధిలో కూడా ఒక నూతన దశను ప్రారంభించింది. ఈఘటన, విప్లవానికి పూర్వపు రచయితలు చాలా మందికి అత్యంత ముఖ్యమైనదిగా పరిణమించింది. వీరిలో— చాలా భాగం వీరిలో అత్యంత ప్రతిభావంతులైన వారు అని చెప్పాలి —విప్లవంలో కలిసిపోయారు. గోర్కీ, మయకొవస్కీ, సెరఫిమోవిచ్, దెమ్యాన్ బెద్నీ మాత్రమేకాదు విప్లవాన్ని బలపర్చినది. బ్లోక్, బ్రియసోవ్‌వంటి ప్రముఖ సంకేత కవులుకూడా విప్లవాన్ని బలపరిచారు.

1918 కష్టదినాలలో బ్లోక్ వ్రాసిన "పన్నెండు" ఉద్రిక్తతకు, నాటకీయతకు, తీవ్రతకూ గణనీయమైనది. యిది పాత ప్రపంచానికి మృత్యు మృదంగంవలె ధ్వనించి వుంటుంది. విప్లవ ప్రభంజనాన్ని కవి కీర్తించారు. "విప్లవ సంగీతాన్ని వినండి!"అని ఆయన సవాలు చేశారు.

యువకుడైన మయకొవస్కీ తన పద్యాలను వీధుల్లోనికి తీసుక వెళ్ళారు, సభలకూ, కార్మికుల వద్దకూ, ఓడలమీద నావికుల వద్దకూ, బేరక్కులలోని సైనికులవద్దకూ తీసుక వెళ్ళారు. సృజనాత్మక అన్వేషణలలో ఆయన తిరుగులేని వ్యక్తి. పూర్తిగా నూతనమైన గమనంతో ఆయన పద్యాలను సృష్టించారు, ప్రజా సామాన్యం ఎదుట బిగ్గరగా చదవడానికి ఉద్దేశింపబడినవి.

పార్టీ కార్యకర్త, దూరప్రాచ్యంలో గెరిల్లా పోరాట యోధుడు అయిన ఎ. ఫెదయేవ్ 1923లో "ప్రవాహం", "ఏటికి ఎదురీత" అన్న తన నవలను తొలిసారిగా ప్రచురించారు. 1926లో ఆయన నవల "పంథొమ్మిది", సోవియట్ రచయితల ప్రథమ శ్రేణులలో ఆయనకు స్థానాన్ని చేకూర్చింది.

వీర చపయేవ్ డివిజన్ కమిసార్, డి. పుర్మనోవ్ అంతర్యుద్ధంగురించి ఒక అతిచక్కని రచనను చేశారు. అది "చపయేవ్" అన్న నవల. తరవాత తొందర్లోనే "పితూరీ" అన్న నవల.

అంతర్యుద్ధంలో అష్టకష్టాలన్నీ సహించిన తరం ప్రతినిధులు సాహిత్యంలోనికి, యుద్ధకాలపు దుస్తులలో యింకా యుద్ధ రంగపు వాసన కొడుతూ వచ్చారు. వీరు నిజంగా ఒక విజేతల తరం.

వీరు కలసి అక్టోబరు విప్లవానికీ, అంతర్యుద్ధానికి సంబంధించిన మహా గ్రంథాలను సృష్టించారు.

మా విప్లవం గురించి, అంతర్యుద్ధం గురించీ తెలుసుకోవాలనుకున్నవారు యం. షొలొఖోవ్ వ్రాసిన "డాన్ నదీ ప్రశాంత ప్రవాహం", ఎ. సెరఫిమోవిచ్ వ్రాసిన "ఇనప ప్రవాహం", వియస్. ఇవనోవ్ వ్రాసిన "గెరిల్లా కథలు", డి. పుర్మనోవ్ వ్రాసిన "చపయేవ్", కె. ఫెదిన్ వ్రాసిన "నగరాలూ, సంవత్సరాలు", యఫ్.గ్లద్కోవ్ వ్రాసిన "సిమెంటు", ఎ. ఫెదయేవ్ వ్రాసిన "పంథొమ్మిది" చదవాలి....ఇవి కొన్ని సుప్రసిద్ధ గ్రంథాలు.

ఈ పుస్తకాలు చదివితే, జాతుల, వారి దేశాల భవిష్యత్తును నిర్ణయించడానికి గొప్ప పోరాటాలలో ఎలా విజయాలు పొందినదీ, తాము సాధించిన విజయాల గొప్పదనాన్ని సగర్వంగా గుర్తించిన ప్రజా సామాన్యపు ఉత్తేజం ప్రపంచ చరిత్రలో ఒక నవశకాన్ని ప్రారంభించిన యీ చారిత్రికోద్యమంలో తప్పనిసరిగా సంభవించే కని విని యెరుగని కష్టాలూ, క్షుద్బాధ, వినాశం, విషాదాలూ మీకు తెలుస్తాయి.

కొన్నికొన్ని సందర్భాలలో మోటుగా వున్నా, కాని సర్వదా ఆరోగ్యవంతులూ, బలిష్టులూ అయిన కొత్త ప్రజలూ, సోషలిజం కోసం, సోషలిజం నిర్మాణం కోసమూ పోరాడే యోధులూ మీకు కనిపిస్తారు. వారి విశ్వాసాల నిర్మాణాత్మక శక్తి, వారిని ఉత్తేజపరిచిన ఆదర్శాల వైభవ సౌందర్యాలు మీకు తెలుస్తాయి.

మనిషి శక్తి, అతనికి ప్రజలతో గల అభేద్యమైన సంబంధాల మీద ఆధారపడి వుంటుంది, ప్రజల మూల ప్రయోజనాలను కాపాడడానికి అతనుచేసే నిర్విరామ సమరంపైని ఆధారపడి వుంటుంది— 1920 ప్రాంతంలో అంతర్యుద్ధం గురించి ప్రచురించబడిన అన్ని రచనలలోనూ పదేపదే ఉద్ఘాటింపబడిన దిదే.

ఒక యావత్తు సోవియట్ రచయితలతరం కృషి, విప్లవాన్ని, దానిపట్ల ప్రజల దృక్పథాన్నీ అర్థం చేసుకోవడానికి వినియోగింపబడింది.

ఈ శతాబ్దపు మూడో దశాబ్దం, మా సారస్వతం చరిత్రలో ధైర్యంగా సృజనాత్మక అన్వేషణలు సాగిన, చాలా మంది రచయితలకు సృజనాత్మక స్వయం నిర్ణయం జరిగిన దశాబ్దంగా నిలిచిపోతుంది.

యువ సోవియట్ సాహితీ సేవకులకు మిత్రుడూ, గురువూ అయిన గోర్కీ వాణి ఎన్నడూ నీరస పడిపోలేదు.

జీవితాన్ని అన్ని దృక్పథాలనుండి అధ్యయనం చెయ్యమనీ, చారిత్రిక సంఘర్షణలను సత్యంగా, బాగా చిత్రించమనీ గోర్కీ యువ రచయితలకు నేర్పారు; తమ పాత్రల గతిని నిర్భయంగా చెప్పమనీ, తమ వృత్తిని ప్రేమించమనీ, సోషలిస్టు వాస్తవికతను దృఢంగా అనుసరించమనీ వారికి బోధించారు.

ఎ. టాల్‌స్టాయి ప్రవాసంనుండి తిరిగి వచ్చారు. ఆయన బృహత్ నవల "కఠిన పరీక్ష"లోని వీరులవలె ఆయన, తన దేశం, రష్యా అక్టోబరు విప్లవంచే కాపాడబడి రక్షింపబడిందని గుర్తించారు.

అక్టోబరు విప్లవం పదవ వార్షికోత్సవ సమయాన, ఎ. టాల్‌స్టాయి ఒక వ్యాసం వ్రాసేరు. "అక్టోబరు విప్లవం నాకు సర్వమూ

* యల్. ఎకిమెంకో వ్రాసిన "సామ్యవాద వాస్తవికత, సోవియట్ సాహిత్య సృజనాత్మక రీతి" అన్న తొలి వ్యాసం 18వ సంచికలో ప్రచురింపబడింది.

యిచ్చింది।" అన్న దాని శీర్షిక విప్లవంపట్ల ఆయన దృక్పథాన్ని తెలియజేస్తుంది.

ఎహ్రెన్‌బర్గ్ తన సంశయాలనూ, సందేహాలనూ వదిలిపెట్టి వచ్చిన పెద్ద మార్పుల అర్థాన్ని గుర్తించారు. ఈ శతాబ్దం మూడవ దశాబ్దం ప్రారంభంలో "ఒక నగటురోజు", "ఊపిరి తీసుకోకుండా" అన్న నవలలను వ్రాశారు. ఈ రెండూ సామ్యవాద నిర్మాణ కవితా భరితమైనవి.

ఆనాటి దేశపు సారస్వత జీవితంలో క్లిష్టమైనదీ, పరస్పర వైరుధ్యాలతో కూడుకున్నదీ చాలా వుండేది: విభిన్న సారస్వత దృక్పథాల, విభిన్న బృందాల, ధోరణుల సంఘర్షణను తరచూ జరుగుతూ వుండేవి. ఈ సంఘర్షణలు తరచు సృజనాత్మకమైనవి మాత్రమే కాకుండా, తాత్త్విక స్వభావం గలవి కూడానూ. ఆకార ప్రాధాన్యవాదం (ఫార్మలిజం) అనబడే ఒక ధోరణి సమకాలీన మహత్తర ఘటనలను చిత్రించవలిసే తమ కర్తవ్యంనుంచి రచయితలను వేరుచేసి, పూర్తిగా ఆకార ప్రధానమైన భావాల త్రోవకు వారిని పట్టించడానికి ప్రయత్నించింది. అతివాద కళా సంఘటన సిద్ధాంతకర్తలవంటి యితరులు, కళలో భావనకు ప్రాధాన్యత లేదని, కేవలం యదార్థ విషయాలతో సారస్వతం వుండాలని బోధించారు.

ప్రజల సమిష్టి కృషికి గొప్ప పరివర్తనలను చిత్రించడానికి ప్రయత్నిస్తూ కొందరు రచయితలు, నిరంకుశమైన అరాచక చర్యలను, "మూక" యొక్క వినాశాత్మక శక్తినీ పొగడసాగారు. "నాయకుడు" లేకుండా, ప్రజలను నిరాకారమైన మూకగా చూపడానికి ప్రయత్నాలు సాగాయి.

బిడ్డ పెరుగుదలలో జబ్బు తప్పనిసరిగా వచ్చేటట్టు, యీ తప్పులన్నీ సమిష్టి కృషిచే పట్టువలగా అధిగమించబడ్డాయి.

తన అన్వేషణలను సాగిస్తూ నవ్య సోవియట్ సారస్వతం ఆకార ప్రాధాన్యవాద పెడమార్గాన్నీ, జీవితపు "మురికి"లోనికి సహజత్వం పేరిట చొచ్చుకపోవడాన్నీ, కుహనా కావ్యనాయకుల కాల్పనిక ప్రత్యేకతలనూ తృణీకరించి, సత్య, వాస్తవికతల పతాకను ప్రతిష్ఠించింది.

"మనశకపు హృదయస్పందనాన్ని బాగా గ్రహించగల, మన శకంలో అంగర్భాగం అయిపోయిన దాని గురించి విపరించడం మాత్రమే కాకుండా దానిని మార్పుచేయగల, వర్తమానంలోమాత్రమే కాకుండా భవిష్యత్తును కూడా దర్శించగలవాడే నిజమైన రచయిత కాగలడు." సోవియట్ రచయితల కర్తవ్యాల గురించి "సిమెంట్" గ్రంథకర్త యఫ్. గ్లాద్కోవ్ యీ విధంగా నిర్వచించారు.

విప్లవ పరివర్తనల కనుగుణంగా వుండే యీ ప్రాతిపదికపైనే వివిధ ధోరణులుగల రచయితలమధ్య, వివిధ సృజనాత్మక పోకడల మధ్య క్రమక్రమంగా సమ్మేళనం సాధింపబడింది. 1934లో ఒకేఒక సోవియట్ రచయితల సంఘం స్థాపింపబడినప్పుడు, తదుపరి చాలా కాలానికి యీ సమ్మేళనం ఒక సంస్థగా రూపొందింది.

---

## గాంధీజీ, ఆయన ప్రభావమూ

(14వ పుట తరువాయి)

చేసినది, శాంతికొరకై ఆయనచేసిన కృషి. రెండు ప్రపంచ యుద్ధాల భయంకర పరిణామాలను గాంధీజీ చూడగలిగారు. విజేతలైన జాతులు సైతం, ఓడించబడిన వాటితోపాటు ఎటువంటి కష్టాలకు లోనుకావలసివచ్చినది కూడా ఆయనకు తెలుసు. అందుచేతనే ఆయన ఎటువంటి యుద్ధాలనైనా సరే నిరోధించాలన్నారు. రెండవ ప్రపంచ యుద్ధానంతరం, పెద్దవేకాని, చిన్నవేకాని, సకలజాతుల ముందున్న ప్రప్రధానమైన కర్తవ్యం, ఆర్థిక, సాంస్కృతిక, సాంఘిక, విద్యావిషయిక ప్రాతిపదికలను పటుతరం చెయ్యడమేనని, ఈ లక్ష్యసిద్ధికి శాంతి అనివార్యమనీ ఆయన అభిప్రాయపడ్డారు. శాంతి ప్రయత్నాలను ప్రోత్సహించడం ద్వారా కూడా యుద్ధం తిరిగి సంభవించకుండా చెయ్యవచ్చు. శాంతిని ప్రచారం చెయ్యడానికి, శాంతిని ప్రతిష్టాపించడానికి సోవియట్ ప్రజలు. ఇప్పుడు కేంద్రీకృత కృషి చెయ్యబోతున్నారు కాబట్టి, వారికి ఇదివరకే ఈ దృష్ట్యా అపార కృషిచేసిన గాంధీజీ అంటే ఒకవిధమైన సానుభూతి, సాన్నిహిత్యం కలగడం సహజమే. రష్యన్ ప్రజలు ఆయనను ఒక మహత్తర శాంతి ప్రవక్తగా పరిగణిస్తారు, యీ లక్ష్యసిద్ధికి ఆయన చేసిన మహోపకృతిని అత్యున్నతంగా ప్రస్తుతిస్తారు.

ఇక్కడ, యీ సోవియట్ దేశంలోని ప్రజలు గాంధీజీని గురించీ, ఆయన సిద్ధాంతాలను గురించీ తెలుసుకోవడానికి ఎంతో ఉత్సహిస్తుండడం నాకు అపరిమితమైన ఆనందాన్ని కలిగించింది. మొన్న ఒకమాటు, గాంధీజీని గురించి కొద్దిమందికి ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడిన ఒక గోష్ఠిలో నేను మాట్లాడుతున్నప్పుడు, ఆయన బహుముఖ కార్యక్రమాల గురించి అనేకులు, శోధించే ప్రశ్నలు వేశారు, ముఖ్యంగా అస్పృశ్యతను, కులతత్వాన్నీ నిర్మూలించటానికి ఆయన ఏమిచేసినదీ చెప్పమన్నారు, గాంధీజీ, స్త్రీల యొక్క ప్రతిపత్తిని ఏవిధంగా పైకి తీసుకరాగలిగినదీ వారు తెలుసుకోవడానికి ఎంతో ఆకాంక్షించారు. ఏమైనప్పటికీ ఇటువంటి జిజ్ఞాస వుండడంలో కొత్త ఏమీ లేదు. నాకు ప్రసిద్ధ రష్యన్ రచయిత లియో టాల్‌స్టాయ్, గాంధీజీకి, ఆయన దక్షిణాఫ్రికాలో పౌరసత్వాల కోసం పోరాడుతున్నప్పుడు వ్రాసిన విషయం జ్ఞాపకం ఉన్నది. కాగా గాంధీజీకి టాల్‌స్టాయ్ పట్ల ఎంతో పూజ్యభావం వున్నది, దక్షిణాఫ్రికాలో తాను నెలకొల్పిన క్షేత్రానికి "టాల్‌స్టాయ్ క్షేత్ర"మని నామకరణం చేశారు కూడా. అంతేకాదు, ఆ తర్వాత గాంధీజీ, టాల్‌స్టాయ్ కథలు "అవివేకి ఇవాన్," "మనిషికి ఎంతమేర కావాలి?" అన్న రెండింటినీ గుజరాతీ భాషలోకి తర్జుమాచేసి, వాటిని భారతీయ పాఠకులకోసం ప్రకటించారు. భారతీయ, రష్యన్ జాతుల మీద ప్రశంసాత్మకమైన యీ పారస్పర్యపు ప్రభావం ప్రతిబింబించక తప్పదు.

కొన్నాళ్ళక్రిందట నేను, ప్రసిద్ధ సోవియట్ బాల సారస్వత నిర్మాత కొర్నీ చుకోవ్‌స్కీని కలుసుకున్నాను. ఇతర విషయాలతో పాటు, ఆయన, గాంధీజీ రచనలను చదవాలన్న తన కుతూహలాన్ని వెలిబుచ్చారు. గాంధీజీ అంటే ఆయనకు ఎంతో అభిమానం. "ఆయన, ఎంతో.... మహాపురుషుడు".... "ఆయన జీవితానికి సంబంధించిన సారస్వతాన్ని తెప్పించుకోవాలనుకుంటున్నా"నని చెప్పారు. గాంధేయ సారస్వతాన్ని గురించి ఎన్నో విషయాలను అడిగేవారిని ఎంతోమందిని ఇక్కడ నేను చూడగలిగాను.

# ట్రాలీ బస్సు డ్రైవర్

మా విలేకరి





మాస్కో వీధులలోని ట్రాలీబస్సు

జిగేల్‌మనే ఎర్రని అట్టతో వున్న ఒక కొత్త పుస్తకం ప్రతులు, ఒక పుస్తకాల షాపులో ప్రముఖంగా ప్రదర్శింపబడ్డాయి. అది బోరిసోవ్ రచించిన "జూలెస్ వెర్ని మూడు ప్రాణాలు". వెర్ని అభిమానులు పొడవాటిబారుగా కౌంటర్ వద్ద కాచుకుని వున్నారు. నేను కూడా అందులో వున్నాను. మధ్య వయస్సులో వున్న ఒక దృఢగాత్రుడు, పదకొండు పన్నెండేళ్ళ అమ్మాయితో నాకు సరిగ్గా వెనుక నిలబడ్డాడు. ఆ అమ్మాయి, గాభరాగా "చాలినన్ని ప్రతులు లేక, మనకు దొరకవేమో!" అని అంటూనే వుంది.

ఈ సంభాషణను నేను వినకుండా వుండటం సాధ్యంకాదు గనుక, యీ గ్రంథకర్త రచనలతో ఆయన ఆ అమ్మాయికి ఆసక్తిని కల్పించాడని తెలుసుకున్నాను. వారి దగ్గర అప్పటికే ఆయన గ్రంథాలన్నీ వున్నాయి. ఆ అమ్మాయికి ముఖ్యంగా "వింతద్వీపం" నచ్చింది. కేప్టెన్ నెమో ఆ అమ్మాయికి అభిమాన పాత్ర. ఇప్పుడు వారు ఆయన జీవిత కథను చదవాలని ఉబలాట పడుతున్నారు.

ప్రతులన్నీ అయిపోయాయని ప్రకటించడానికి ముందర నేను ఆఖరు ప్రతిని సంపాదించడం తటస్థించింది. సంతృప్తితో వెళ్ళిపోవడానికి నేను తిరిగాను. ఆ అమ్మాయి, తోడుగా వచ్చిన ఆయన దిగులు ముఖాలతో వుండడం చూశాను. వారు విచారంగా వున్నారు. నేను ఆ అమ్మాయి బిగించిన పిడికిళ్ళలో ఆ పుస్తకాన్ని పెట్టాను. ఆయన వద్దనడానికి ప్రయత్నించాడు. నేను చేసింది పెద్ద త్యాగం ఏమీకాదనీ, నేను యింకో ప్రతిని సంపాదించుకుంటాననీ చెప్పాను.

సెమియోన్ ష్విరియయేవ్‌తోనూ, అతని కుమార్తె నటాషాతోనూ నాకవిధంగా పరిచయమైంది. మేము దుకాణంనుంచి కలిసివెళ్ళాము. ఆయనకు పుస్తక పఠనం చాలా అభిమానమైన విషయమని త్రోవలో నేను తెలుసుకున్నాను. ఆ చిన్నమ్మాయికికూడా ఆయన పుస్తకాలంటే బాగా అభిమానాన్ని రేకెత్తించాడు. ఆయనదగ్గర చాలా పుస్తకాలున్నాయి. కొత్త పుస్తకాలను కొనడం మాత్రమే కాకుండా, ప్రతి ఆదివారం మా పాత పుస్తకాలమ్మే దుకాణాలకు ఆయన తప్పనిసరిగా వెళ్ళేవాడు, తనకిష్టమైన పుస్తకాలు కొనుక్కునేందుకు. ఆయన సాహిత్యరంగంలో పనిచేసేవాడని నాకు నమ్మకం ఏర్పడింది. చివరకు అదాయనను అడిగాను. ఆయన నవ్వేసి, తాను ట్రాలీ బస్సు డ్రైవర్నని చెప్పాడు. అప్పుడతని విషయంలో నాకు ఆసక్తి రేకెత్తింది.

మా పత్రిక పాఠకులు యిటువంటి వారి గృహ జీవితం గురించి తెలియజెయ్యమని అడిగారన్న సంగతి, యిది నాకు జ్ఞాపకం చేసింది. "సోవియట్ భూమి"లో అతని గురించి వ్రాయడానికి నేను తన యింటికి ఛాయాచిత్ర గ్రాహకునితో వస్తానన్న నా సూచనను ఆయన అంగీకరించాడు.

ష్విరియయేవ్ కుటుంబం నోవో-పెశ్చనయ వీధిలోని ఒక నూతన గృహంలోని చక్కని చిన్న యింట్లో వుంటోంది. మేము గదితో కూచోడానికి ముందర ఆయన మమ్మల్ని బాల్కనీ మీదికి తీసుక వెళ్ళాడు. పుస్తకాలే కాకుండా ఆయనకు యిష్టమైన యితర విషయాలుకూడా వున్నవని స్పష్టమయ్యింది. ఆయన బాల్కనీ కనుల పండువుగా వుంది. మట్టి గోలాల్లో పూలు కాస్తున్నాయి, అనేక మొక్కలు పెరుగుతున్నాయి. లతలు త్రాళ్ళ మీదుగా కిటికీల వేపుకు ప్రాకుతున్నాయి. విశ్రాంతి సమయాన్ని ఎక్కువగా గడపడానికి,





ఒక ఆసక్తి దాయకమైన టెలివిషణ్ కార్యక్రమాన్ని
చూడటానికి కుటుంబీకులంతా
సమావేశమయ్యారు

ఎడమ పైని :
వంటపనిలో సెమ్యోన్ భార్యకు తోడుపడుతున్నాడు



నటాషాకు తొందర్లోనే బైసికిల్ తయారవుతున్నది. తండ్రి ఆమెకోసమని దానిని బిగిస్తున్నాడు

వీలయ్యేలాగ యిది అద్భుతంగా తయారు చేయబడింది.

ష్విరియయేవ్ తన భార్య మారియాతోనూ, చిన్న కూతుళ్ళు జీనా, నటాషాలతోనూ వుంటున్నాడు. పెద్ద కూతురు నినాకు పెళ్ళయిపోయింది. ఆమె కన్‌స్ట్రక్షన్ ఇంజినీరు. తన భర్తతో వుంటూవుంది. జీనా యిప్పుడిప్పుడే సెకండరీ పాఠశాలనుంచి ఉత్తీర్ణురాలయింది, లోహ యింజినీరింగ్ విద్యాసంస్థలో ప్రవేశానికి దరఖాస్తు పెట్టింది. చిన్నమ్మాయి నటాషా బడిలో ఐదోఫారం చదువుతోంది.

ఆయన జీవితకథ సామాన్యమైనది. ఆయన తరంలోని చాలా మంది కార్మికుల జీవితం వంటిదే, తులామండలంలోని పొపోవ్కా-గ్రామంలో ఒక రైతు కుటుంబంలో పుట్టి, ఆయన గ్రామ పాఠశాలలో చదువుకుని, గనిలో పనిచేయడానికి వెళ్ళాడు. తరవాత ఆయన మాస్కోకు వెళ్ళాడు. కొంతకాలం ఆయన ఒక ఫాక్టరీలో పనిచేశాడు, ట్రాలీ బస్సు డిపోలో పంచ్ ప్రెస్ ఆపరేటర్‌గా పనిచేశాడు. కాని అతను అన్నిటికంటె ఎక్కువగా వాంఛించినది, డ్రైవర్ కావాలని. డిపో ఆయన కోరికను మన్నించి, డ్రైవర్ల శిక్షణకై తాను నడుపుతోన్న పాఠశాలకు పంపించింది. తన శిక్షణను పూర్తి చేసుకున్నాక సెమియోన్ ష్విరియయేవ్ మాస్కోలో ట్రాలీబస్సు డ్రైవరయ్యాడు.

డ్రైవరుగా యిరవై ఏళ్ళు పనిచేసినందుకు యిటీవల ఆయన గౌరవింపబడ్డాడు. మ్యునిసిపల్ ఎకానమీ మంత్రిత్వశాఖ యీ సందర్భాన ఆయనకు అర్హతా యోగ్యతా పత్రాన్ని, ప్రత్యేకమైన బోనస్సును యిచ్చింది.

తన చిన్న జీవితకథను చెప్పడం పూర్తి చేశాక, ఆయన తన భార్యవేపు ప్రేమతో చూసి, మారియాను చేపట్టాక తనకు అదృష్టం పట్టిందన్నాడు. తన సౌఖ్యానికి ప్రధాన కారణం ఆమెయే అన్న విషయాన్ని నిరూపించదానికన్నట్టుగా, యిటీవలనే యీ దంపతులు తమ వివాహ రజితోత్సవాన్ని జరుపుకున్నారు.

అది సుఖంగా జీవిస్తోన్న కుటుంబం. దానిలో ప్రేమ, సామరస్యం ఎవరికేనా కనిపిస్తాయి. ఆయన కుమార్తె జీనా, గర్వం తొణికిసలాడే కళ్ళతో, తాను వాడుక చేస్తోన్న సైకిలును తన తండ్రి యింట్లో అమర్చారని చెప్పింది.

అతని హాబీల సంఖ్యకు అంతున్నట్టుగా లేదు. ఆయన గృహోపకరణాలను కూడా తయారు చేస్తారు. మందస్మితంతో మారియా—తన భర్త గుణాలలో అతని నైపుణ్యం తనకు బాగా నచ్చినవిషయమన్న సంగతి యీ

మందస్మితం మనకు సుస్పష్టం చేస్తుంది—

ఒక బట్టలుతికే యంత్రాన్ని మాకు చూపింది. ఇది ఆయన సృష్టించినదే. దాని నతను యింట్లో తయారు చేశాడు. కాని ఫాక్టరీలలో తయారు చేసినవాటికది నైపుణ్యంలో ఏమీ తీసిపోవడంలేదు. ఇదికాక ఒక కుట్టు మిషను, మాంసం కైమాకొట్టే యంత్రమూ వున్నాయి. ఇవ్వన్నీ విద్యుచ్ఛక్తిచే నడుపబడేవి.

తమ వార్షిక సెలవులకోసం ఆ కుటుంబం సన్నాహాలు చేస్తోంది. వారు ఓల్గామీద పడవ మీద వెళ్తున్నారు. ఇటువంటి ప్రయాణం వారు యిదివరకు చేశారు. ఇల్లు వదిలి వెళ్ళుతున్నామన్న కొంత దిగులుతో మారియా పడవలో కూచొని అడవులూ, కొండలూ, విశాలమైన బయళ్ళు, నగరాలూ, గ్రామాలూ చూడడం చాలా సంతోషమైన విషయమని అంది. ఓల్గా నదిపైని సూర్యాస్తమయ దృశ్య సౌందర్యం గురించి ఆమె విపులంగా మాటాడింది. ఇంతసేపూ జీనా, ఏమీ ఉత్సాహం చూపకుండా ఒక మూలను కూచుంది. ఆమె వెళ్ళడం లేదు: ప్రవేశ పరీక్షలకోసం ఆమె ఉండిపోవాలి....

మధ్యాహ్నం, సాయంకాలమైపోయింది. మేమింకా మంచి సంభాషణలో వున్నాం. వారి ఆతిథ్యాన్ని మేము దుర్వినియోగంచేస్తున్నామేమో అని అనిపించింది. ఇక వెళ్ళాలి. కాని వారితో మాటాడుతుంటే చాలా ఉత్సాహంగా వుంటుంది. ఇది కేవలమూ కుటుంబ వ్యవహారాలూ, యింటివిషయాలూ మాత్రమే కాదు. మేము సారస్వతం గురించి మాటాడేము, కొన్ని యిటీవల వచ్చిన పుస్తకాల గురించి తీవ్రచర్చలో ప్రవేశించాము. తరవాతను రాజకీయాల గురించి, పంట అవకాశాల గురించి, సరికొత్త చలనచిత్రాలూ, నాటక ప్రదర్శనల గురించి మాటాడేము.



ఈ షాపులోని ప్రతివ్యక్తీ ఎస్. సెమ్యోన్‌ను ఎరుగుదురు. ఎందువల్లనంటే ఆయన ఎప్పుడూ ఇక్కడికి వస్తుంటాడు



పువ్వులపట్ల శ్రద్ధవహించడం అవసరం, అంచులో పూల విషయంలో శ్రద్ధ వహించకముందే సెమ్యోనోవు మంచి సరదా

విజ్ఞాన శాస్త్రం, క్రీడలగురించికూడా వదిలిపెట్టలేదు.

స్విరియయేవ్‌కు ఎన్నో విషయాలలో ఆసక్తి వుంది. కాని యీనాటి సోవియట్ కుటుంబాలకు యిది అసాధారణమైనదేమీకాదు. ప్రపంచ వ్యవహారాలలోనూ, తమ దేశ జీవితంలోనూ సాధారణంగా ఆసక్తి కలిగి వుండడం, సోవియట్ ప్రజలకు సహజ గుణమైపోయింది.

# హంగేరీ ఘటనల గురించి వివరణ

ఆస్ట్రియన్ రచయిత్రి : ఇవా ప్రిస్టర్

> ఒక ఆస్ట్రియన్ రచయిత్రి వ్రాసిన యీ ఆసక్తిదాయకమైన వ్యాసం మాకు మిత్రరాజ్య సమితిలో "హంగేరియన్ సమస్య" అనబడేది చర్చించబడుతున్న సమయంలో చేరింది. అనుకున్నట్లుగానే అమెరికన్ ప్రతినిధివర్గం ప్రతిపాదించిన తీర్మానంమీద వాషింగ్టన్ ఆజ్ఞానుసారం మిత్రరాజ్య సమితిలోని అధిక సంఖ్యాక దేశాలు రబ్బరు స్టాంపును వేశాయి. అయినప్పటికీ, యీ సవ్వింపు తీర్మానాన్ని బలపర్చని ప్రతినిధివర్గాలు 1,400 మిలియన్లకంటే యెక్కువమంది ప్రజలను, అనగా ప్రపంచ జనాభాలో అధిక భాగానికి ప్రాతినిధ్యం వహిస్తున్నాయన్న విషయాన్ని యీ సందర్భంలో గమనించవలసి వున్నది.

చిట్టచివరికి మిత్రరాజ్య సమితి హంగరీ ఉపసంఘం అనబడేదాని దుష్ట నివేదికను చర్చించడం ప్రారంభించింది. ఈ ఉపసంఘం "హంగేరియన్ సమస్యను పరిశీలించడానికి" అమెరికా డిమాండు చేయడంవల్ల యేర్పాటు చేయబడిందన్న విషయం అందరికీ తెలిసిందే. అట్టపై మిత్రరాజ్యసమితి చిహ్నంగల బృహద్గ్రంధంగా వెలువడిన యీ నివేదిక దాదాపు ఒక నెలక్రితం అచ్చువేయబడింది. కాని కొన్ని దేశాలలో ఉదాహరణకు, అతి దూరాన ఉన్న దేశాల జనాభాకంటే హంగేరియన్ సంఘటనలను గురించి కచ్చితమైన భావాలను కలిగివున్న ప్రజలతో కూడిన ఆస్ట్రియాలాంటి హంగరీ సరిహద్దునవున్న దేశాలలో ఆ నివేదిక దొరకడం దాదాపు అసాధ్యంగా ఉన్నది. ఆస్ట్రియన్ అధికారులకు అది లభించలేదు. అంతేకాదు. ఆ నివేదికను ప్రచారం చేయడంలో ఆసక్తిని కలిగి వుండవలసిన అమెరికన్ ప్రచారకేంద్రాలకు గూడా అది అందలేదు. అలా ఎందుకందలేదో కారణం స్పష్టమే.

ఉపసంఘం "శ్రద్ధతో వాస్తవ విషయాలను" సేకరించినట్లు పైకి అగుపడే యీ నివేదికలో మిత్రరాజ్యసమితి ప్రచురణ దేనిలోను ఇంతకుముందు మనం చూచి ఉండని విపరీతమైన కట్టుకథలు, రుజువుపర్చబడని, రుజువుపర్చబడజాలని నిందలు, వదరుబోతు ప్రకటనలు, పచ్చి అబద్ధాలు ఉండడం మూలానే అది వాళ్ళదగ్గర లభించడం లేదు.

"హంగరీ విషయిక ఉపసంఘం" యెలా పనిచేసింది? ఆ ఉపసంఘం, పరిశీలించమని సూచింపబడిన సాక్షులనే పరిశీలించింది. ఇతర సాక్ష్యాలు దానికి అవసరమనిపించలేదు.

అవును, శిబిరాలలో వున్న కాందిశీకులను చిత్తశుద్ధితో ప్రశ్నించి తెలుసుకొన్నట్లయితే గత సంవత్సరపు హంగరీ సంఘటనలను గురించి వాస్తవ విషయాలు గ్రాహ్యమయ్యేవే. ఎందువల్లనంటే వారిలో అందరూ విప్లవ ప్రతిఘాతకులు, పచ్చి అబద్ధాలకోరులుకారు. ఉపసంఘం శ్రమతీసుకొని శిబిరాలలో ఉన్నవారిని నిపాదిగా, పక్షపాత రహితంగా, ఓపికతో ప్రశ్నించి సంగతులు తెలుసుకొని ఉండినట్లయితే కనీసం కొంతయినా సత్యంవెల్లడయ్యేది. కాని ఉపసంఘం అలాంటి శ్రమ తీసుకొనదల్చుకోలేదు. ముందుగా ఇది ముగ్గురు "ప్రామాణిక" కాందిశీకులను ప్రశ్నించినది. వీరిలో మొదటి ఇద్దరు-బెలాకిరలి, జోసఫ్ కొవాగో-ప్రతి విప్లవాన్ని ప్రత్యక్షంగా జరిపించినవారు. మూడవమనిషి అన్నా కెత్లీ దేశానికి ద్రోహం చేసిన ఒక సోషల్ డెమోక్రాటిక్ పార్టీ సభ్యురాలు. హంగరీ "యూరోపియన్ సంఘం"లో చేరాలని ఇప్పుడు బహిరంగంగా చెబుతున్నది.

దీని తర్వాత యీ సంఘం కిరలే, కొవాగోలు నమ్మదగినవారని సిఫారసు చేసిన సాక్షులందరి సాక్ష్యాన్ని విన్నది. అటు తరవాత బెల్జియం, కెనడా, డెన్మార్క్, ఫ్రాన్స్, ఇటలీ, బ్రిటన్, అమెరికా ప్రభుత్వాలు, అనగా హంగరీలో విప్లవ ప్రతిఘాతక తిరుగుబాటుకు కారకులని అనుమానింపబడిన "నాటో" దేశాల ప్రభుత్వాలు సిఫారసు చేసిన సాక్షులు పరిశీలించబడ్డారు.

ఇక వాస్తవ విషయాలమాట. హంగరీ సంఘటనలను అంచనా వెయ్యడంలోను, హంగేరియన్ ప్రభుత్వం సోవియట్ సైన్యాన్ని సహాయం కోరడానికి కారణం చెప్పడంలోను ముఖ్యంగా గమనించవలసినది హంగరీకి బయటినుండి యేర్పడిన ప్రమాదం. అక్టోబరు మాసాంతం మొదలుకొని, హార్తీ బంటులు, హంగరీ, తదితర దేశాల "ఎస్. ఎస్" సభ్యులతో కూడిన "క్రాస్ ఏరోస్" అను ఫాసిస్టు సంస్థ సభ్యులు, ఆస్ట్రియా, పశ్చిమ జర్మనీలనుంచి "ఆస్ట్రియా సరిహద్దుగుండా హంగరీకి దొంగచాటుగా పంపించబడసాగారు. రెడ్‌క్రాస్ ముసుగుతో ఆయుధాలతో నిండిన పూర్తి రైలుబళ్ళే హంగరీకి రవాణా చేయబడ్డాయి.

హంగరీ మరొక కొరియా అయ్యే ప్రమాదం యేర్పడింది. ఇది నూతన ప్రపంచ సంగ్రామానికి దారితీసే ప్రమాదంకూడా వాటిల్లింది. ఆ సమయంలో హంగరీలో, లేదా హంగరీ సరిహద్దుల్లో ఉండిన మేమందరము, ముఖ్యంగా పశ్చిమ జర్మనీ నుంచి ప్రత్యక్షమైన ఆ "స్వాతంత్ర్య యోధుల"ను చూచాము. "రెడ్ క్రాస్" చిహ్నం ముసుగుచాటున ఆయుధాలు చేరవేయబడడం మేము చూచాము. పశ్చిమ జర్మనీ, ఫ్రాన్సు, బ్రిటన్‌లకు చెందిన అనేక బూర్జువా వార్తా పత్రికలుగూడా ఆ సమయంలో మేము చూచిన విషయాలను గురించే వ్రాశాయి. కాని ఈ ఉపసంఘం "క్రాస్ ఏరోస్", తదితర ఫాసిస్టుసంస్థల దండ్లు రహస్యంగా సరిహద్దుగుండా చేర్చబడ్డాయన్న వాస్తవవిషయాన్ని "త్రోసి పుచ్చింది." దీనిని సమర్థించుకోడానికి ఉపసంఘం, సరిహద్దును ఆ సమయంలో మూసివేశామని ఆస్ట్రియా ప్రభుత్వం చేసిన ప్రకటనను చూపుతున్నది. ఆస్ట్రియా రక్షణమంత్రి సరిహద్దు ప్రాంతాన్ని స్వయంగా పరిశీలించాడనీ, తనతోపాటు నాలుగు అగ్రరాజ్యాల సైనిక ప్రతినిధులను గూడా తీసుకు వెళ్లాడనీ అంటున్నది.

బయటి వత్తిడి మూలంగా సరిహద్దులను తెరచిన ఆస్ట్రియా ప్రభుత్వం యొక్క నేరాన్ని కప్పిపుచ్చడానికే యిది ఉద్దేశింపబడింది. వేలకొలది సాక్షులతో దీనిని రుజువుపర్చవచ్చును. కాని ఉపసంఘం, తాను సరిహద్దును తెరవలేదని చెప్పుకొంటున్న ఆస్ట్రియా ప్రభుత్వపు మాటనే ప్రమాణంగా స్వీకరిస్తూ, అందరికీ తెలిసిన విషయాన్ని విస్మరించింది. సమస్యను యెంత వాస్తవ ధోరణిలో పరిశీలించింది!

నివేదికలో వందలకొలది పుటలలో సంతరింపబడిన రకరకాల

అబద్ధాలను ఖండించడం ఒక్క వ్యాసంలో అసాధ్యమన్న మాట వాస్తవమే. ఈ ఉపసంఘం యెలా పనిచేసిందో తెలియజేయడానికి రెండు ఉదాహరణలను మాత్రం తీసుకొందాము.

సోవియట్ సైన్యం హంగేరియన్ ప్రజల సహాయం కొరకు రాలేదనీ, దురాక్రమణ జరిపిందనీ ఏ విధంగానైనా సరే రుజువు చేయాలని నిర్ణయించుకున్నారు, యీ నివేదికను తయారు చేసినవారు. ఈ ఉద్దేశ్యంతోనే ఉపసంఘం ఈ "దురాక్రమణ చర్య"కు ముందుగానే సాధకం వేయబడిందని రుజువు చేయాలనుకున్నది. అక్టోబరు 22వ తేదీననే, లేదా అంతకుముందే 20వ తేదీన సోవియట్ సైన్యం హంగరీపై "దండయాత్ర"కు సిద్ధమవుతూ వచ్చిందని నివేదికలో పేర్కొనబడింది. దానికి నిదర్శనం? "బహుశ" అక్టోబరు 20, 21 తేదీలలో సోవియట్ సైనికదళాలు కొన్ని, సరిగ్గా యెక్కడ జరిగిందీ ఆ స్థలం సంగతి తెలియదు గాని—బల్ల కట్లపై డ్రిల్లుచు చేశాయని కొన్ని "నమ్మకమైన" వర్గాలద్వారా ఉపసంఘానికి తెలియవచ్చింది. డాన్యూబ్ నదికావల వైపుననున్న సోవియట్ సైన్యాలు హంగరీపై మూక ఉమ్మడి దాడికై సిద్ధమవుతూ వచ్చాయనడానికి సాక్ష్యంగా ఇది ఉద్దేశింపబడుతున్నది. "నమ్మకమైన వర్గాల" యొక్క యీ వార్త యెంత గొప్పదో ఇక్కడ ఉల్లేఖించడం మంచిది. "....హంగరీలో సాయుధ తిరుగుబాటును జరిపించడానికి సోవియట్ అధికారులు అక్టోబరు 20వ తేదీ ముందునుంచి కూడా చర్యలు గైకొంటూ వచ్చినట్లు తెలుస్తున్నది," అని నివేదికలో ఉన్నది (రష్యన్‌నుంచి తిరిగి అనువదింపబడింది) దీనిపై వేరే వ్యాఖ్య అనవసరం.

సహజంగానే, నివేదికను తయారుచేసినవారు, అప్పుడు ప్రబలిన భయంకర హింసాకాండను కాదంటున్నారు. అక్టోబరు 24వ తేదీ తర్వాత మొదటి కొద్దిరోజుల్లో చిన్న ఘర్షణలు జరిగాయి కాని, అక్టోబరు 30వ తేదీ తర్వాత అంతా ప్రశాంతంగా ఉండినదని వారు చేసిన ప్రకటన, "మహోజ్జ్వలము", "రక్తపాత రహితము" అయిన హంగేరియన్ విప్లవాన్ని సోవియట్‌దేశం క్రూరంగా అణిచివేసిందని చెప్పడానికి ఉద్దేశింపబడింది. ఒక్క బుడాపెస్ట్ నివాసులేగాక, అనేకమంది విదేశీ పత్రికావిలేఖరులు గూడా ఆ సమయంలో జరిగిన అంతులేని దాడులను, దోపిడీలను, గ్రంథాల దహనాన్ని అక్టోబరు 29, 30 తేదీలలో హంగరీ రాజధానిలోను, తర్వాత ఇతర నగరాల్లోను చూచారు. కాని ఇదంతా ఉపసంఘంవారి "వాస్తవికత"కు గీటురాయికాదు. అందువల్ల దానిని విస్మరించారు.

ఈ నివేదికను తయారుచేసినవారు నిజాన్ని రుజువుపర్చదలుచుకున్న ఆత్మశుద్ధిగల పరిశీలకులు కారనీ, తమ అమెరికన్, తదితర "నాటో" యజమానులను సంతోషపెట్టదలుచుకొన్న మోసగాళ్ళు, దుష్టసాహసికులు నన్న విషయాన్ని గమనించినట్లయితే, యీ విషయం యెవ్వరికీ ఆశ్చర్యాన్ని కలిగించదు.

---

## శాంతి వర్ధిల్లడానికి ఒక మార్గం

(15వ పుట తరువాయి)

అందువల్లనే జనరల్ ఎసెంబ్లీ సమీప, మధ్యప్రాచ్య ప్రాంతంలోని ఉద్రిక్త పరిస్థితిని విస్మరింపకూడదు. ఈ ప్రాంతంలోని వివిధ ప్రజల ఆంతరంగిక వ్యవహారాలలో "నాటో" దేశాలు నిరంతరం జోక్యం కల్పించుకొంటుండడమే యీ ఉద్రిక్తతకు మూలకారణం. నాలుగు అగ్రరాజ్యాలైన అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్, సోవియట్ దేశ ప్రభుత్వాలు సమీప, మధ్యప్రాచ్య దేశాలలో బలప్రయోగాన్నీ, ఆ ప్రాంతపు దేశాల ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యాన్నీ పరిత్యజించడం అవసరము. ఈ సూత్రాలను జనరల్ ఎసెంబ్లీ యేదో ఒక రూపంలో అంగీకరించినట్లయితే అది శాంతిప్రియ ప్రజల ఆందోళనకు కారణభూతమవుతున్న పరిస్థితులను కల్పించిన ఆ ప్రాంతంతో మామూలు సంబంధాలు యేర్పడడానికి దోహదమివ్వగలదని సోవియట్ ప్రభుత్వము అభిప్రాయపడుతున్నది.

యూరపులోని పరిస్థితి, అన్ని దేశాల మధ్య విస్తృత ఆర్థిక సహకారాభివృద్ధి మొదలైన ఇతర అత్యవసర సమస్యలను పరిష్కరిస్తుందని కూడా వివిధ ప్రజలు మిత్రరాజ్యసమితి జనరల్ ఎసెంబ్లీ వైపు చూస్తున్నారు. ఇదంతా ప్రపంచ శాంతిని పటిష్టం చేయడానికి తోడ్పడుతుంది.

జాతులమధ్య శాంతి. స్నేహాలకు విలువనిచ్చే వారందరి హృదయాలను సోవియట్ దేశ ప్రభుత్వం ప్రతిపాదించిన శాంతి ప్రతిపాదనలు ఆకర్షించి తీరుతాయి. వీటిని అమలు పర్చడమే మిత్రరాజ్యసమితియొక్క పవిత్రధర్మం.

---

## "బోల్షివిక్" ప్రభుత్వక్షేత్రంలో భారతీయ అతిధులు

(21వ పుట తరువాయి)

సోవియట్ ప్రజలు సాంస్కృతిక, ఆత్మిక విషయాలలోకూడా ఎంతో అభివృద్ధిని సాధించారు. అయినప్పటికీ వస్తు విషయికంగా సమృద్ధతను సాధించగలగడానికి వారు సుదీర్ఘ పోరాటం సాగించవలసి వుంది.

భారీ పరిశ్రమ ఇప్పటి అభివృద్ధికరమైన ఉత్పాదక స్థాయిని అందుకోగలిగేట్టు చెయ్యడానికి, వారు అపారమైన సాధన సంపత్తిని వినియోగించవలసి వచ్చింది. పాసిజంతోటి పోరాటంలో వారు మహత్తర త్యాగాలు చెయ్యవలసి వచ్చింది.

కొన్ని సంవత్సరాల తర్వాత మరొకసారి ఇక్కడికి వచ్చి, ప్రజలు చక్కటి గృహాలలో, సమిష్టిక్షేత్ర, ప్రభుత్వక్షేత్ర గ్రామాలలో సుస్థితమైన జీవితాన్ని గడుపుతుండడం చూడాలని నా ఆకాంక్ష.

మన ఉభయజాతుల మధ్యన వున్న స్నేహం పటుతరం కాగలదనీ, సోవియట్ ప్రభుత్వ క్షేత్రాలు గణించిన అనుభవ పరిజ్ఞానాన్ని మాకు సముత్సుకతతో పంచి యివ్వగలరనీ, ఈ వ్యుత్పన్నత మాకు అత్యంత దోహదకారి కాగలదనీ నేను దృఢంగా విశ్వసిస్తున్నాను.

# మానవుడి పాట్లు

కథకుడు: మిఖయిల్ షోలఖోవ్ అనువాదకుడు:- శ్రీ.శ్రీ.



మిఖయిల్ షోలఖోవ్, డాన్ నదీ తీరాన వున్న ఒక కొసక్ గ్రామం, క్రుజిలిన్‌లో, 1905 లో జన్మించారు. మొదట (1924-26) వ్రాసిన కథసంపుటాలలో ఆయన, కొసక్కుల దైనందిన జీవితాన్ని ఆచారాలను చిత్రించారు.

షోలఖోవ్ ప్రముఖ రచనలు "డాన్ నదీ ప్రవాహం" (1926-1940,) "ఏన్న దున్నారు" (1932.)—మొదటిదానిలో డాన్ నదీ తీరప్రాంతపు విప్లవజీవితాన్ని, రెండవదానిలో పరివ్యాప్త మవుతున్న వ్యవసాయ సమిష్టీకరణను వర్ణించారు.

యుద్ధకాలంలో షోలఖోవ్ అనేకరంగాలను విశేషరీతిగా సందర్శించారు. ఆయన రచించిన వ్యాసాలు (ద్వేష శాస్త్రం మొదలైనవి), 'దేశంకోసం పోరాడారు' అన్న నవలలోని వివిధ ప్రకరణాలు గాఢమైన, దేశభక్తితో నిండివున్నాయి.

1955 లో "ఏన్న దున్నారు" అన్న నవల రెండవ భాగం ప్రకటితమైంది.

షోలఖోవ్, సోవియట్ దేశ శాస్త్ర విజ్ఞాన పరిషత్తు సభ్యులు. సుప్రీం సోవియట్ సభ్యులు. 1955, మేనాటి సంఖ్యా వివరాలనుబట్టి ఆయన రచనల ప్రతులు, 2 కోట్లకు పైగా, 55 భాషలలో ప్రచురితమైనట్టు విశద మవుతున్నది.

యుద్ధం ముగిసిన మరునటి సంవత్సరమది. మార్చి మాసాంతంలో, అజోవ్ సముద్ర తీరంనుంచి, వేడి గాడ్పులు వీచటం ప్రారంభమైంది, నదీ సమీపంలో గడ్డకట్టుకపోయిన మంచు కరిగిపోయి, విపరీతంగా ప్రవహించి, ఏవిధమయిన ప్రయాణం చేయటానికి వీలు కానంత ఘోరంగా తయారయ్యాయి రోడ్లన్నీ......

పరిస్థితులీవిధంగా వున్నప్పటికీ, బుఖనవస్కయాలోని, 'స్టనిట్సా' గ్రామానికి, తప్పనిసరిగా నేను వెళ్ళవలసి వచ్చింది. వెళ్ళవలసిన దూరం 60 మైళ్ళకంటె ఎక్కువ లేకపోయినా, అదేదో దూరప్రయాణం లాగే కనపడింది. రెండుగుర్రాల బండిలో బయల్దేరాం. నేనూ నా మిత్రుడూ కలసి. అప్పటికింకా, సూర్యోదయం కాలేదు....గుర్రాలు మంచి బలమైనవే అయినా, మంచులో, ఇంచుమించుగా సగంవరకూ కూరుకుపోయిన బండి చక్రాల్ని లాగలేక ఒగరుస్తూన్నాయ్....వాటికీ మరీ కష్టమైనచోటుల్లో మేమే, క్రిందకు దిగి నడిచాం. నడుస్తున్నప్పుడు, బూట్ల అడుగులలో మంచు దూరిపోయి, బూట్లు రెట్టింపు బరువై పోయాయ్. దానికి తోడు, ప్రవహిస్తున్న ఆ మంచులో, వేసిన అడుగు, లోపలికంటా కూరుకుపోయి, తీయటం యమయాతనైంది. ఉదయాన వీచేగాలి చల్లగానే వున్నా గుర్రాల చెమటతో కలిసి, పీల్చితే మత్తుగా వుంది. తయారయినప్పటికీ, ముందుకు సాగిపోయాం....ఆరు గంటలు, ఈ నరక బాధను భరిస్తూ, 'ఎలంకా' నదిదగ్గరికి చేరుకునేసరికి, తల ప్రాణం తోకకు వచ్చింది. తీరాచూస్తే, మేం వచ్చింది 30 మైళ్ళు! అంటే ఇంకా సగందూరం వెళ్లాలన్న మాట! అబ్బ!

'మొఖవస్కీ' గ్రామం దగ్గరున్న ఆ చిన్ననది, సాధారణంగా ఎప్పుడూ ఎండిపోయే వున్నా, ఇప్పుడు బాగా పొంగి, మైలు వెడల్పుతో-ప్రవహిస్తూ, అక్కడున్న బయళ్ళనన్నీ ముంచేసింది. మేం అవతలి ఒడ్డుకు వెళ్లాలి. నదిని దాటటానికి, అక్కడ, ఒక పాడైపోయిన ఒకపాత దోనె తప్ప మరేమీలేదు. ఆ డొక్కు దోనెలో, ఇద్దరు, ముగ్గురు ఎక్కినా, మునిగిపోయేట్లుగా వుంది. నదికి అవతలి ఒడున ఒక 'షెడు' కనిపించింది. అదిబహుశా, ఉమ్మడి వ్యవసాయక్షేత్రానిది కావచ్చు. ఆ 'షెడు'లో ఒక పాత 'జీప్' కారు వుంది. అది మాకోసమే వచ్చినట్లుంది. ఆ జీప్ డ్రైవర్ని పిలిస్తే, అతను ఇవతలి వైపుకు వచ్చాడు. అతను వచ్చేలోపలే, మేంవచ్చిన, గుర్రాల బండిని, పంపించేశాం. నా మిత్రుడూ, మా సామాన్లతో, గట్టుమీద కూర్చున్నాడు....నేనూ, డ్రైవరూ, దోనెలో ఎక్కాం.... ప్రవాహంలో దానిష్టం వచ్చినట్టు పోతోంది దోనె. దాని చెక్కలన్నీ, పాతవై పోయి, ఊడి పోతున్నాయ్. ఆ సందుల్లోంచి, కెరటాలు కొడుతున్న నీళ్ల లోపలికొచ్చి చేరుకొంటున్నాయి....దానికి తోడు, మా యిద్దరి బరువు ఎక్కువై పోయి, ఆ దోనె అప్పటికే సగంపైగా నీళ్ళల్లో మునిగిపోయింది. పెద్ద కెరటంవచ్చి కొట్టినప్పుడల్లా, అది ఇటూ అటూ ఊగిపోతూంటే, ఒడ్డు చేరుకుంటామనే ఆశ నాలో ఇగిరిపోయి, గుండె కొట్టుకోటం ఎక్కువై పోయింది. అరచేతిలో ప్రాణాలు పెట్టుకొని, అలాగే కూర్చున్నాం. మేం అవతలి ఒడ్డు చేరేటప్పటికి గంట పట్టింది. తీరం చేరుకునేసరికి, గుండె తేలికై, హాయిగా గాలి పీల్చుకున్నా. డ్రైవర్ గ్రామందగ్గరున్న 'జీప్'ను తీసుకొచ్చి, తిరిగి దోనెదగ్గరకు వెళ్ళాడు. దోనెలో కూర్చుంటూ అరుస్తున్నాడతను "ఈ డొక్కు దోనె. నీళ్ళల్లో ముక్కలవకుండా వుంటే, రెండు గంటల్లో, మీ స్నేహితుణ్ని ఇక్కడకు తెస్తాను. అంతకన్నా ముందే వస్తామని మాత్రం అనుకోవద్దు' అంటూ తెడ్డుని నీళ్ళల్లో వదేసి, తోసుకుంటూ పోతున్నాడు. నేను వెనక్కు తిరిగి చూశాను. గ్రామం దూరంగానే వుంది. ఆ చుట్టుపక్కలంతా నిర్మానుష్యంగా వుంది. ఏ అలజడీ లేక, ఎడారి వాతావరణాన్ని గుర్తు తెచ్చింది. కెర

టాలతో యుద్ధంచేస్తూ ముందుకు సాగిపోతున్న ఆ డ్రైవర్ ఇంకా మసక మసకగా కనిపిస్తోనే వున్నాడు. పొంగిపొరలుతున్న ఆ నదిని చూస్తూంటే, మా ప్రయాణం తలపుకొచ్చి. అసలు గమ్యం చేరుకోగలమా అన్న సందేహం ఎక్కువ కావొచ్చింది. ఆలోచిస్తున్న కొద్దీ బుర్ర వేడెక్కుతోంది. అందుకని, ఆలోచన కట్టిపెట్టి, సిగరెట్ తాగాలని, గట్టుమీద చతికిలబడ్డా. సిగరెట్ కోసం, జేబులో చెయి పెడితే, ఏముంది, తడిసిన సిగరెట్ పెట్టె చేతికి తగిలింది. ఒక్క క్షణం అలాగే వుండిపోయాం. గడచిన సంఘటన కళ్ళముందు సిల చింది. మేం, ఆ దోనెలో, సగందూరం వచ్చేటప్పటికి, ఒక పెద్ద కెరటం వచ్చింది. దాని తాకిడికి, దోనె, తల్లక్రిందులైనంత పని జరిగింది. అప్పుడు నేనుకూడా, తెడ్డు తీసుకుని, గబగబా నడపాల్సి వచ్చింది. ప్రాణం రక్షించుకోవాలన్న ఆ ఖంగారులో, నా నడుం వరకూ, తడిసిపోయిన సంగతే నేను పట్టించుకోలేదు. ఆ సమయంలో, సిగరెట్లు అసలు గుర్తుకొస్తాయా ? అందుకే, ఇప్పుడు విచారించాల్సి వస్తోంది. 'సరేలే ఏం చేస్తాం' అనుకుంటూ తడిసిపోయిన ఆ సిగరెట్లను తీసి, ఆ గట్టుమీద ఆరబెట్టాను.

అప్పటికి మధ్యాహ్నం అయింది. 'మే' నెలలో వుండేటంత తీవ్రంగా వుంది ఎండ. సిగరెట్టు త్వరగా ఆరిపోతాయిలే అని సంతోషించా. కాని, సైన్యంలో ఇచ్చిన, ఉలసరి బట్టలు వేసుకున్నందుకు మాత్రం విచారించా. జుట్టు ఆరబెట్టటం కోసం, తలమీది టోపి తీసేశాను. ఒకవైపు, నెత్తి మాడుతున్నా, అలా, ఒక్కణ్ణీ అక్కడ, ఆ మబ్బుల్నీ, నదినీ, నిర్జన ప్రదేశాన్నీ చూడటంలో ఏదో ఆనందంగానే వుంది.

అంతలో, గ్రామం చివరనుంచి, వస్తున్న ఒక మనిషి కనపడ్డాడు.... అతనిముందు నడుస్తున్నాడు ఒక ఆరేళ్ళ కుర్రాడు ...వాళ్లు చాలా హడావుడిగా నడుస్తూ, 'జీప్' దాకా వచ్చారు, 'జీప్'ను చూసి ఆగి, వాళ్లు నా వైపు వచ్చారు. ఆ పొడుగాటి స్థూలకాయుడు తిన్నగా నా దగ్గరకొచ్చి, 'హలో, బ్రదర్' అంటూ, తన బలమైన మోటు చేతిని ముందుకు చాచాడు. 'హలో' అంటూ, నేనూ, అతనితో కరస్పర్శ చేశాను. ఆ మోటుమనిషి వంగి, కుర్రాడితో అంటున్నాడు. 'చిన్నాన్నకు నమస్తే చెప్పుబాబూ ! మీ నాన్నలాగే, ఇతనుకూడా డ్రైవర్‌లా కనిపిస్తున్నాడు. మనిద్దరం లారీ నడిపేవాళ్ళం, ఇతను, ఈ చిన్నకారుని నడుపుతున్నట్టున్నాడు....'

ఆకాశంకంటే నిర్మలంగా వున్న చిన్న కళ్ళతో అమాయికంగా చూస్తూ, ధైర్యంగా చెయ్యిచాచాడు కుర్రాడు. వాడిని చూస్తే, నాకెంతో ముద్దొచ్చింది. ఆనందంతో వాడిచెయ్యి నొక్కాను. చల్లగావుంది. "ఏం తాతా ? ఎండ దంచేస్తున్నా, నీచెయ్యి ఇంత చల్లగావుందేం ?" అన్నా నవ్వుతూ.

నా మోకాళ్ళకు మెలేసుకున్నవాడు, ఆశ్చర్యంగా నా కళ్ళల్లోకి చూస్తూ "నేనేం తాతనుకాదు చిన్నాన్నా ! మంచుతో బంతులు చేసి ఆడాను అందుకే నా చేతులు చల్లగావున్నాయ్...."అన్నాడు ధీమాగా, అక్కడికి తనేదో పెద్ద ఘనకార్యం చేసినట్టు. వాడు మాట్లాడే తీరు చూస్తే, నాకు నిజంగా చచ్చేంత నవ్వొచ్చింది, ఆపుకోలేక నవ్వాను. నాతోబాటే నవ్వుతూ ఆ మోటుమనిషి, వీపునున్న మూటనుదింపి, నా ప్రక్కన కూర్చొన్నాడు. నేనేమీ అడగకుండా, అతనే చెప్తున్నాడు "వీడొక పెద్ద బండనాకు....వీడి తస్సాదియ్యా, బలే వేపుకు తింటాడులే. అసలుచెప్పిన మాటవింటాడా ? అబ్బే, అదేం లేదు తమ్ముడూ.......ఊరికేపరిగెడతాడు. ఎందుకు చెప్పూ, నామీద అలపటం, నన్ను ఆయాసపర్చటం....పోనీ తిన్నగా నడుస్తేనా.... అహఁ అదీలేదు....రాళ్ళతో ఆడటం...., మంచుతో బంతులు చేయటం....అబ్బబ్బ....వాణ్ని అదుపులో పెట్టటానికి తాతలు దిగి వస్తున్నారనుకో...."అంటూ కాస్సేపు నిశ్శబ్దంగానే వున్నాడు.... "నా సంగతేంటి బ్రదర్....యజమానికోసం కూర్చున్నావా ?" మళ్ళీ అడిగాడు. ఎందుకో, నేను డ్రైవర్ని కాదన్న విషయం అతనికిప్పుడే చెప్పాలనిపించలేదు నాకు, అందుకే 'ఔను' అన్నాను.

"అతను అవతలివైపునుంచి వస్తున్నాడా ?"

"ఔను"

"దోనె త్వరగానే వస్తుందా ?"

"రెండు గంటల్లో రావచ్చు."

"సరే అయితే బాగానేవుంది.నాకూ బాగా వ్యవధి వుంది. నేనూ కాస్త 'విశ్రాంతి' తీసుకోవచ్చు. నాకూ పెద్ద తొందరలేదులే. పోతూ పోతూ నిన్ను చూసి, సరేలే, మనవాడొకడిక్కడ కూర్చున్నాడు కదా. కాస్సేపు సరదాగా మాట్లాడుదాం అని ఇటు వచ్చా. పైగా సిగరెట్ తాగుదామనుకున్నా. ఒంటిపిల్లి రాకాసిలా ఒక్కడు తాగుతే ఏంమజావుంది. ఏమంటావ్ ? ఏం సిగరెట్లు తడిపేశావా ? భలే వాడివే ! తడిసిపోయిన పొగాకు—జబ్బుచేసిన గుర్రం, రెండూ దండగే...., ఔనా ?.... హుఁ !....సరే.... నాదగ్గరున్న సరుకును రుచిచూడు...." అంటూ ... అతను పాంటుజేబులోంచి సిల్కు పొకెట్ ఒకటి బయటకు తీశాడు....పొట్లం విప్పుతోంటే, దాని మీదున్న అక్షరాలు. స్పష్టంగా తెలుస్తున్నాయ్ ..."ప్రియమైన సైనిక మిత్రునికి, లెబ్యన్‌స్కాయా సెంకడరీ స్కూల్ విద్యార్థి ప్రేమతో ఇచ్చినది"అని వుంది.

ఆ పొగాకును ఇద్దరం కాల్చాం....ఇంట్లో పండించిన ఆ పొగాకు చాలా ఘాటుగా వుంది. పొగతాగుతూ, చాలాసేపటివరకూ ఇద్దరం మాట్లాడలేదు. వాతావరణం అలావున్నప్పుడు, రోడ్లు అంత అపకతవకగా వున్నప్పుడూ, ఆ కుర్రాణ్ని తీసుకుని, ఎక్కడికెళ్తున్నాడా అని అడుగుదామనుకున్నా. కాని, అతనే ముందు నన్ను అడిగాడు.

"యుద్ధం జరిగినంతకాలం డ్రైవర్‌గానే వున్నావా ?"

"ఇంచుమించుగా"

"యుద్ధరంగంలోనేనా ?"

"ఆహాఁ !"

"బాగానేవుంది ఐతే మనిద్దరం ఒకటేనన్నమాట....నేనూ, అలాగే పనిచేసి, చాలా అవస్థలు పడ్డాలే తమ్ముడూ........" అన్నాడతను, తన రెండు చేతుల్తో మోకాళ్ళను రాసుకుంటూ. అలా కూర్చున్న అతన్ని పరికిస్తూ, అతని కళ్ళల్లోకి చూశా. కాని, చిత్రం..... ఆ విధంగా, ఒక్క నిమిషంసేపు, అతని కళ్ళల్లోకి సూటిగా చూడలేకపోయా. నేనే ఏమిటి ? దైన్యత, ఏదో అర్థంకాని బాధ ప్రతిబింబిస్తోన్న కనుపాపల్లోకి ఎవరుమటుకు చూడగల్గుతారు ? ప్రక్కనేవున్న ఎండుపుల్ల ఒకటి తీసుకుని, దానితో ఇసుకలో ఏదో వ్రాస్తున్నాడు. అతను ఇసుకవైపునుంచి, దృష్టి మరల్చకుండా, అలాగే చూస్తూ అంటున్నాడు: "అదేమిటో ఒక్కొక్కప్పుడు, రాత్రుళ్ళు, నాకు అసలు నిద్రేపట్టదు. చీకట్లోకి చూస్తూ అలా

కూర్చుంటే, బలేవిచిత్రమైన ప్రశ్నలు నాముందు నిలుస్తాయి సోదరా.... నేనెందుకు బ్రతికుండాలి? అసలు ఎవరికోసం బ్రతకాలి? నిస్సారమైన ఈ బ్రతుకువల్ల ప్రయోజనం ఏంటి....?....ఇంకా ఏమేమో నా ప్రశ్నలు....ప్రశ్నల పరంపరలు.... ప్రశ్నలేకాని జవాబుల్లేవు....ఆ రాత్రి చీకటిగాని పగలు సూర్యకాంతిగాని, ఆ ప్రశ్నలకి జవాబివ్వలేదు....ఇకముందుకూడా ఇవ్వవ్ తమ్ముడూ....ఇవ్వవ్...." అతని జీరబోయిన గొంతులోంచి మరి మాటలు పెగలలేదు....అతను...., తన చిన్న కొడుకుని దగ్గరకు తీసుకుని, ప్రేమతో తల నిమురుతూ "బాబూ........ఆడుకోవా? నీళ్ళతో ఆడితే బలేగా వుంటుంది? ఔనా.... ఊఁ!....అద్గదీ....అయితే మరిపో.... ఆడుకో ......" అంటూ వాడి చెక్కిళ్ళమీద ముద్దెట్టుకున్నాడు....స్వేచ్ఛకలిగినందుకు సంతోషిస్తూ, ఛంగునదూకి, పరిగెట్టాడా కుర్రాడు ......"చూడు బట్టలు తడుపుకోకు" అన్న అతనిమాటలు వినుపించుకోకుండానే, నీళ్ళదగ్గరకుపోయి గెంతుతున్నాడు వాడు.

పొగతాగుతూ, మరికొన్ని క్షణాలు, నిశ్శబ్దంగానే గడిపేశాం. నీళ్ళదగ్గరున్న ఆ కుర్రాడిమీదేవుంది నా దృష్టిఅంతా. ఖరీదైనవి కాకపోయినా, చక్కని బట్టలు కట్టుకున్నాడు ఆ కుర్రాడు .. పొడుగు చేతులకోటూ, ఆ ఉన్ని బుల్లి మేజోళ్ళు, వాడికి బాగా సరిపోయింది. నల్ల సిల్కుతో కుట్టబడిన పువ్వులు, చక్కగా కత్తిరించబడ మెడ. ఆ కోటుకు అందం చేకూర్చాయ్....అవి తయారుచేయబడిన తీరు చూస్తుంటే, అవన్నీ. ఎవరో..... బాగా పనితనంగల, అమ్మ చేసినట్లుగా వున్నాయ్ ...ఆ తండ్రి తొడుక్కున్న బట్టలు చూస్తుంటే, నిజంగా వింతగా నేవుంది ...అసలే. అతను తొడుక్కున్నది ఎప్పటిదో పాతకోటు....అందులో....చిరిగిపోయిన చోటల్లా.... చిందరవందరగా కుట్టబడింది....పెద్దపెద్ద మాసికలతో ఆ పాంటు ఘోరంగావుంది....అతని కాలికున్న మేజోళ్ళనిండా కన్నాలే ... వాటి అవతారంచూస్తే, ఆబట్టలకెప్పుడూ, ఆడదాని చెయ్యి తగిలినట్టు లేదు....ఒకవేళ అతనికి భార్యలేదేమో....! లేకపోతే, భార్యకీ, అతనికీ ఏదైనా తగాదాఏమో అనుకున్నా....

నీళ్ళతో కేరింతాలు కొడుతున్న కొడుకును ఒకసారి చూసి, తిరిగి మాట్లాడటం మొదలెట్టాడతను........"చాలా సాధారణంగానే మొదలైంది నా జీవితం.... అసలు 'మావూరు ఒరునెజిగబర్నియా' నేను 1900వ సంవత్సరంలో పుట్టాను ..." అని ఛట్టున ఆపేశాడతను....పీలుస్తున్న పొగ, గొంతులోపోయి, ఒక్క నిమిషం ఉక్కిరి బిక్కిరి అయ్యాడు పాపం....కాస్సేపయ్యాక, తిరిగి చెప్పసాగాడు....ఒళ్ళంతా చెవులుచేసుకుని విన్నాను...."అవి దేశంలో, కలహాలు చెలరేగిన రోజులు. అప్పుడు నేను, 'ఎర్రసైన్యంలో'ని 'కిషిడ్జె' దళంలో వుండేవాడిని. 1920వ సంవత్సరంలో.... 'కుబాన్' ప్రాంతాలకు వెళ్ళిపోయా. అక్కడ, 'కులక్'ల దగ్గర, పశువులకంటే కష్టంగా పనిచేసిబ్రతికేవాణ్ణి. మా అమ్మా, నాన్నా, చెల్లి, అంతా, ఆకలి కరువుకు ఆహుతైపోయారు....ఈ ప్రపంచంలో 'నా' అనేవాళ్ళు అంతాపోయి, చివరికి నేను మటుకు మిగిలా. సరే ఎలాగో ఒక సంవత్సరం గడిచిపోయింది. 'కుబన్'లో వున్న గుడిశెను అమ్మేసి, తిరిగి 'ఒరునెజ్'కు బయల్దేరా. మొదట్లో ఒక ఫ్రంగి దుకాణంలో పనిచేసి, తర్వాత, ఫాక్టరీకి వెళ్ళా. అక్కడ మెకానిక్ పని నేర్చుకున్నా....తర్వాత, వెంటనే నాకు పెళ్ళయింది. నాభార్య మొదటినుంచీ, పిల్లల శిక్షణాలయంలోనే పెరిగిందట. ఆమె దిక్కులేనిది అయినా బలేపిల్లే. నాకుమల్లేకాకుండా, చురుకైనది, గడుసుది. ఇతర్లను సంతోషపెట్టడంలో బలేనేర్పరిలే. కష్టాలను, చిన్నతనంనుండే రుచిచూసింది కాబట్టి, ఇతర్లబాధను సులువుగా అర్థం చేసుకునేది. ప్రక్కనుంచి కాకుండా ఎదురుగుండా చూస్తే ఆమె ఎంత బాగుండేదనుకున్నావ్? అందుకే, నేనెప్పుడూ, ఎదురుగుండానేవుండి చూస్తూ వుండిపోయేవాణ్ని....నిజం చెప్పాలంటే బ్రదర్....ఆమెను ప్రేమించినంత 'ఇది'గా ప్రపంచంలో మరెవ్వరినీ ప్రేమించలేను.... మరెప్పుడూ ప్రేమించనూలేను.

పనిచేసి, చేసి, ఇల్లు చేరుకునేసరికి చిరాగ్గావుండేది. ఒక్కొక్కప్పుడూ మహాచిరాగ్గావుండేది. అయినా, ఆమె ఎప్పుడూ విసుక్కునేదికాదు. పైగా ఎంతో ప్రేమగా దగ్గరికొచ్చి, తియ్యగా మాట్లాడేది. దానితో మనసు శాంతిపడి, ఆమెను దగ్గరకు లాక్కుని "పెధవపనివల్ల చికాకుపడి, దురుసుగా మాట్లాడా, క్షమించవా ఇరీనా", అని అనబోతే, తన మృదువైన చేత్తో, నా నోరు మూస్తూ, తన చిన్నితలను. నా హృదయంలో దాచుకునేది....అప్పుడు నిజంగా బ్రదర్....చేసిన కష్టం అంతా మర్చిపోయి....,ఏదో స్వర్గసౌఖ్యం అనుభవించేవాణ్ణి. ఆ ఆనందంతోనే ఇంత తిని పడుకుని, ప్రొద్దున్నే లేచేసరికి ఎక్కడలేని సత్తువావచ్చేది. తిరిగి ఫాక్టరీలో ఎటువంటి బండపనైనా సునాయాసంగా చేసేసేవాడిని ......అసలు జీవితం సుఖంగా నడవాలంటే, మనకు దొరికే భార్య అంత తెలివిగానూ, ఛలాకీగానూ వుండాలయ్యా....

జీతాలిచ్చే రోజున, కుర్రాళ్ళతో కలసి, అప్పుడప్పుడు నేనూ తాగేవాణ్ని...ఒక్కొక్కప్పుడు, తప్పతాగి, ఒళ్ళుతెలియక, కాళ్ళీడ్చుకుంటూ వచ్చేవాణ్ని. అప్పుడుగాని, నన్నెవరైనా వీధుల్లో చూస్తే, తప్పకుండా భయపడేవారే. ఆ రోజుల్లో నేను యువకుణ్ని కాబట్టి, తెగ తాగగలిగేవాణ్నిలే....ఆతాగిన మైకంలో, వీధిలో ఇటూ అటూ తూలుతూ, క్రిందపడుతూ, మీదపడుతూ, ఇంటికెళ్ళేలోపల ఒంట్లో సత్తువ అంతా ఖాళీ అయిపోయేది. దానితో, కుప్పలా కూలిపోయేవాణ్ని. అయినా ఆమె ఏమీ అనేదికాదు. పైగా నవ్వుతూ పలకరించేది...."ఆంద్రీ....ఇవాళ్టికి నువ్విక్కడే పడుకో....మంచంమీద పడుకుంటే, మైకంలో కిందపడిపోతావ్...." అనేది నాదగ్గరకొచ్చి బూట్లు విప్పుతూ. ఏదో మంత్రం జల్లినట్లు, ఆమె చెప్పినట్లల్లా చేసేవాణ్ని. నే పడుకోగానే, తన మెత్తని వేళ్ళతో, నా నుదుటిని, నిమురుతూ, నాకు నిద్ర వచ్చేటంతవరకూ, ప్రేమగా కబుర్లు చెప్పేది.... ఆమెకు నేనంటే ఎంత జాలో ఊహించలేనయ్యా....

ప్రొద్దున్నే, తెలివిలోకి రావటంకోసం, రోజూకంటే రెండు గంటలు ముందే లేపేది. అలా తప్పతాగినతర్వాత వెంటనే, నేనేమీ తిననన్నమాట ఆమెకు తెల్సు....అందుకే, తాగిన తర్వాత ఏమీ జరక్కుండా బాగా ఉపకరించే, 'ఓడ్కా' ఒక గ్లాసునిండా తెచ్చి ఇచ్చేది. "ఆంద్రీ ఇదిగో తీసికో....ఇంకెప్పుడూతాగవుగదూ?"అంటూ అమాయకంగా నాకళ్ళల్లోకి చూసేది....అంతే....మరి తర్వాత అలా తాగేవాణ్ని కాదు. ఆమెకు నాలో అంత నమ్మకం....అందుకే ఆమె ఇచ్చిన 'ఓడ్కా' తాగేసి, ఆమె ప్రేమకు, కృతజ్ఞత తెల్పబోతే, పదాలు దొరకేవికాదు. అందుకే, హృదయంలోనే తెల్పుకునేవాణ్ని. తేలికపడిన గుండెతో లేచి, ఆమెను గాఢంగా ముద్దెట్టుకుని, పనిలోకి వెళ్ళిపోయేవాణ్ని. ఒకవేళ, ఆమె మాత్రం దురుసుగా మాట్లాడినా, తిరిగి తాగివచ్చే వాణ్నేమో! దైవసాక్షిగా, తాగే వచ్చేవాణ్ని. భార్య మూర్ఖురాలైతే, అలాగే జరుగుతుంది....చెబితే నువ్వు నమ్మవ్ కాని బ్రదర్...., ఆ విధంగా జరిగే కుటుంబాల్ని, నేనెన్నో చూశాను....

(సశేషం)

ప్రశ్నలు, జవాబులు:

# చేరువైన నక్షత్రాలు

"దయచేసి మీ దేశంలోని అన్నిటికంటే పెద్ద ఖగోళ పరిశోధనాలయాన్ని గురించి ఒక వ్యాసాన్ని ప్రకటించండి. ఖగోళ శాస్త్రజ్ఞుల్లో ప్రముఖుడెవరు ?" అని కృష్ణప్రసాద్ అనే మా పత్రికా పాఠకుడు అడుగుతున్నాడు. అతని కోరికనను సరించి మా విలేఖరి, పుల్కొవొ ఖగోళ పరిశోధనాలయం (సోవియట్ దేశంలోని పరిశోధనాలయా లన్నింటిలోకి ఇది పెద్దది) డైరెక్టర్ ఎ. మిఖైలోవ్‌తో ఇంటర్వ్యూ జరిపారు. ప్రముఖ విజ్ఞాన శాస్త్రవేత్త అయిన మిఖైలోవ్ సోవియట్ దేశ ఖగోళ శాస్త్ర సమితి అధ్యక్షుడు. సోవియట్ దేశ విజ్ఞాన శాస్త్ర పరిషత్తు కరస్పాండింగ్ సభ్యుడు. ఆయన మా విలేఖరితో చెప్పిన విషయాలివి.



ఒక రేడియో టెలిస్కోపు. పరిశోధనాలయ కార్యకర్త గ్రహ పరీక్ష చేస్తోన్న దృశ్యం

గత యుద్ధ సమయంలో పుల్కొవొ ఖగోళ పరిశోధనాలయం పూర్తిగా నిర్మూలనమై పోయింది. కాని అదేస్థలంలో ఆధునిక పరికరాలతో కూడిన మరొక బ్రహ్మాండమైన ఖగోళ పరిశోధనాలయం నిర్మింపబడింది. సూర్యుని పరిశీలించేందుకు అనువైన ఒక సౌరదూరదర్శిని యంత్రాన్ని తయారుచేసి, స్థాపించాము. పుల్కొవొ ఖగోళ పరిశోధనాలయం అవసరాలకొరకు, కాకసస్‌లో యూరపులోకల్లా యెత్తయిన ఎల్బ్రిస్ పర్వతందగ్గర (2,100 మీటర్ల యెత్తున) ఒక స్టేషన్ నిర్మింపబడింది. ఇక్కడ, గ్రహణం లేని సమ

డి. పొలోజెన్‌త్సేవ్, అంతగా ప్రకాశవంతంకాని అంతర్జాతీయ గ్రహ పట్టికను బట్టి, గ్రహ పరిశీలన చాలాకాలంగా సాగిస్తున్నాడు. ఈ గ్రహ పరీక్ష వాషింగ్టన్‌లోను, ప్రపంచమంతటా నెలకొనివున్న పరిశోధనాలయాలలోను సాగించబడుతున్నది





The Observatory which began its [illegible] in 1839: The Observatory which was devastated during the second world war — coming here we see before us the inspiration which gave the Observatory its new body within [illegible] years and which is creating a new [illegible] in USSR.

12 July 1954 — P. C. Mahalanobis (India)

Nirmal Kumari Mahalanobis

C M Гоcaл

టెలిస్కోపులున్న గోపురానికి నమూనా
ఏర్పాటుచేసినది పుల్కొవో (పైన)

చనిపోరారనగా ఆయన పుల్కొవో ఖగోళ పరిశోధనాలయాన్ని సందర్శించారు.

సోవియట్ ఖగోళ శాస్త్రజ్ఞులందరిలో ప్రముఖు డెవరన్న ప్రశ్నకు సమాధానం చెప్పడం చాలా కష్టం. సోవియట్ ఖగోళ శాస్త్రజ్ఞులు అనేకమంది ఈ విశ్వ విజ్ఞాన శాస్త్రానికి ఎంతో దోహదం చేశారు.

అంతర్జాతీయ భూపదార్థ సంవత్సర కార్యక్రమాన్ననుసరించి సోవియట్ దేశం అనేక ఖగోళ పరిశోధనాలయాలు ఖగోళ పరిశోధనలను జరుపుతున్నాయి. ఈ పరిశోధనల వల్ల లభించబోయే వివరాలు, లభిస్తున్న శక్తి నిలువలను సక్రమంగా వినియోగించుకోడానికీ, వాతావరణ జోస్యాన్ని ఇంకా సరిగ్గా చెప్పడానికీ, గ్రహాలలో ఒకటిగా ఉన్న భూమిపై జీవితం యొక్క సమస్త లక్షణాలను సమగ్రంగా పరిశీలించడానికీ దోహద మివ్వగలవు.

మాస్కోలో 1958 ఆగస్టులో జరుగనున్న అంతర్జాతీయ ఖగోళ విషయిక సంఘం మహాసభకు రాబోయే అతిథులకు స్వాగత మివ్వడానికి సోవియట్ ఖగోళ శాస్త్రజ్ఞులు అప్పుడే సన్నద్ధు లవుతున్నారు.

ప్రపంచ ఖగోళ విజ్ఞాన శాస్త్రానికి ఎంతో దోహదం చేసిన భారతీయ విజ్ఞాన శాస్త్రవేత్తలు ఈ మహాసభలో చురుకైన పాత్రను వహించాలని మేము అభిలషిస్తున్నాము.



వి. షొబొలెవ్, సహాయ శాస్త్రజ్ఞుడు, సమతల సౌర దూరదర్శినిని, అంతర్జాతీయ భూపదార్థ విజ్ఞాన సాంవత్సరిక కార్యక్రమానుసారంగా పరిశోధనలు జరపడానికిగాను అమరుస్తున్న దృశ్యం

బి. బగిల్డిన్‌స్కీ దూరదర్శిని మట్టాన్ని సరిచేస్తోన్న దృశ్యం



# బాలానందం

ఒక చిన్న గాడిదను, ఒక సమిష్టిక్షేత్రానికి చెందిన, ఒక బాలోద్యాన పాఠశాలకు యిచ్చారు. అది చిన్నదైనప్పటికీ ఎంతో దృఢంగా, చలాకీగా, విధేయురాలై వుండేది. అది బాలలను సవారీకి తీసుక వెళ్లుతుండేది. పాలు, రొట్టె, కాయగూరలు, కట్టెలు మోసుక వస్తుండేది. ఏపనైనా సరే, ఎన్నడూ అది ఎగవేసేది కాదు.

అందరూ గాడిదను ఎంతో పొగిడారు.

అయితే అది ఎల్లప్పుడూ, ఆ విధంగా, మంచిగా వుండేది కాదు. ఒక్కొక్కప్పుడు మొండికెత్తేది, గాడిద లన్నింటిలోని మొండితనానికి సాటి రాదనిపించేది. కట్టెయ్యబోతే తిరగబడిదే. దానిని కట్టేసే గాడి దగ్గర బిడాయించుకొని కదిలేది కాదు, తన్నడమే గాక ఒక్కొక్కప్పుడు దుఃఖకరంగా ఓండ్ర పెట్టేది. అదృష్ట వశాత్తు, ఎవరైనా దానిని కట్టివెయ్య గలిగినట్టయితే, భూమిమీది ఏ శక్తి కూడా దానిని అక్కడినుంచి కదలించ గలిగేది కాదు. వింతలలో వింత, ఎప్పుడూ ఇది మొండికెత్తడం ఒక్క సోమవారాలలోనే జరుగుతుండేది.



గాడిదమీద ఫిర్యాదులు అన్ని దిక్కులకూ వ్యాపించాయి। జంతు ప్రదర్శనాలయ ప్రవీణుడు, పశువైద్యుడూ, సమిష్టి క్షేత్రాధ్యక్షుడూ ఎందరికో ఈ సంగతి చెప్పబడింది. ఇది విని, అంతా తెల్లమొగాలేశారు. ఎందుకు గాడిద సోమవారాలప్పుడు పని చెయ్యదో అసలా కీలకం ఏమిటో ఎవరూ చెప్పలేక పోయినారు.

సోమవారం తర్వాత సోమవారం దీనిని పనిచేయించడానికి పడరాని పాట్లు పడుతుండడంలోనే గడిచిపోతున్నది—హఠాత్తుగా ఒకనాడు, ఆగుట్టు బయట పడి పోయింది। గ్రామ దుకాణపు కాపలాదారు ఆ రహస్యం ఏమిటో విప్పి చెప్పాడు: ఆ గాడిద గ్రామ దుకాణపు పనిలో ఏడు సంవత్సరాలు పనిచేసింది. ఏడేళ్ళు, అది సోమవారాలలో విశ్రాంతి అనుభవించింది. ఇప్పుడది దాని అలవాట్లను మార్చుకోవడానికి ఇష్టపడడం లేదు.

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖ తరపున, జి. ఎఫిమోవ్‌చే 25, బారాకంబా రోడ్, న్యూఢిల్లీ నుండి సంపాదితము, ఎన్. కె. దొరొద్నిత్సిన్‌చే ముద్రితము, ప్రచురితము. ముద్రాపకులు : పంజాబి ప్రెస్, సదర్ బజార్, ఢిల్లీ—6.

# వినోద చిత్రాలు




స్వయంచోదక పాదరక్ష నిర్మాత, దర్జీ

"జోడు అడుగుభాగం ఎక్కణ్ణుంచి వచ్చింది?"
"తప్పుగా మీటనొక్కి ఉండాలి!"



గొప్ప చిత్రకారుడు

"....నా టూత్‌పేస్టు ఎక్కడుందో?"

"నీకు బాగా వుందికదూ, వ్యాసా?"



వ్యక్తి ప్రత్యేకత!



"నేను దీన్నికూడా తెమ్మన్నానా?"



